# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక



సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

సంపుటము 47
సంచిక 37
**26-5-54**

జయ వైశాఖ బహుళ అష్టమి బుధవారం



"సంగీత జ్ఞానము భక్తి వినా
సన్మార్గము గలదే......"
[illegible]

# న్యూస్ రీల్

**శనివారం మే 1:**

—ఏప్రిల్ 28 నుంచి కొలంబోలో సమావేశమౌతున్న ఆగ్నేయాసియా ప్రధానులు అయిదుగురూ నేడు కాండీ (శ్రీలంక)లో సమావేశమై ఇండో చీనా గురించి ఏకగ్రీవమైన తీర్మానానికి వచ్చారు. ఇండో చీనాలో వెంటనే యుద్ధం విరమించబడాలనీ, ఆసియాలో కమ్యూనిస్టు సంస్థలుగాని కమ్యూనిస్టేతర సంస్థలుగాని జోక్యం చేసుకోరాదనీ వీరు హెచ్చరిక చేశారు.

—కొరియా సమస్య గురించి జెనీవాలో బ్రిటన్, రష్యా, అమెరికా ఫ్రాన్స్, చీనా, ఉత్తర కొరియా, దక్షిణ కొరియా ప్రతినిధులు రహస్య సమావేశం జరిపారు.

—టిబెట్‌తో వ్యాపారాది సంబంధాలను గురించి చీనా, భారత ప్రభుత్వాల మధ్య కుదిరిన ఒడంబడికపైన సంతకాలు జరిగాయి.

**బుధవారం, మే 5:**

—ఆగ్నేయాసియాలో ఇండో చీనా ప్రాంత దేశాలమధ్య సమష్టిరక్షణ ఒడంబడిక కోసం సన్నాహాలు సాగుతున్నవని అమెరికా అధ్యక్షుడు ఐసెన్‌హోవర్ ప్రకటించారు. ఇండోచీనా విషయంలో అమెరికన్ విదేశాంగ కార్యదర్శి డల్లెస్ అనుసరిస్తున్న విధానాన్ని సమర్థిస్తూ తనకు తెలిసినంతలో అమెరికాలో డల్లెస్‌వంటి సమర్థుడైన కార్యదర్శి మరొకరు లేరని చెప్పారు.

—కర్నూలులో కొత్త అసెంబ్లీ భవనానికి ముఖ్యమంత్రి ప్రకాశంగారు శంకుస్థాపన చేశారు. ఈ భవనానికి ప్రకాశం హాలు అని నామకరణం చేశారు. ఇక రాజధాని ఇక్కడనుండి హైద్రాబాద్‌కు మారవలసిందేకాని మరో మజిలీ ఉండదని సంజీవిరెడ్డిగారీ సందర్భంలో అన్నారు.

—ఇండోచీనా యుద్ధానికి అమెరికన్ సైనికులను పంపించే ఆలోచన ప్రభుత్వానికి లేదని అమెరికన్ విదేశాంగ మంత్రి డల్లెస్ కాంగ్రెస్ నాయకుల సమావేశంలో తెలియపరిచినట్లు వాషింగ్‌టన్ వార్త.

**గురువారం, మే 6:**

—ప్రత్యేక వివాహ శాసనం అనుసరింప చెయ్యడానికి వధూవరులకు కనీసం 21 ఏళ్ళుండాలని రాజ్యసభ నిర్ణయించింది. (వోటింగ్ విషయంలో సభ్యులకు పార్టీలు స్వేచ్ఛ నిచ్చాయి)

**శుక్రవారం, మే 7:**

—57 రోజుల యుద్ధం అనంతరం వియత్‌నామ్‌లోని డియన్ బియన్ ఫు దుర్గం వియత్ మిన్ సేనలవశమయిందని ఫ్రెంచి ప్రధానమంత్రి ప్రకటించారు.

—రష్యా సూచించిన యూరోపియన్ సమిష్టి రక్షణవిధానాన్ని అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్ ప్రభుత్వాలు నిరాకరించాయి.

—ఉర్దూతోపాటు బెంగాలీ భాషను కూడా పాకిస్తాన్ జాతీయ భాషగా పాకిస్థాన్ రాజ్యాంగపరిషత్తు ఆమోదించింది.

**శనివారం, మే 8:**

ఇండో చీనాగురించి జెనీవాలో తొమ్మిది రాజ్యాల (బ్రిటన్, రష్యా, ఫ్రాన్స్, అమెరికా, చీనా, వియత్ మిన్, వియత్ నామ్, లావోస్, కాంబోడియా) సమావేశం ప్రారంభమైంది.

—ఇండోచీనాను కమ్యూనిస్టులకు ఒప్పగించ గల యుద్ధవిరమణకుగాని సంధికిగాని అంగీకరించరాదని అమెరికన్ విదేశాంగ మంత్రి డల్లెస్ వాషింగ్‌టన్‌నుంచి హెచ్చరిక చేశాడు.

—భార్యాభర్తలు ఉభయుల అనుమతిపైనా విడాకులు పొందవచ్చునని అనుమతిస్తూ ప్రత్యేక వివాహశాసనాన్ని రాజ్యసభ సవరణ చేసింది. సవరణ చేయబడిన విధంగా శాసనాన్ని రాజ్యసభ ఆమోదించింది.

—ఇండోచీనాసమస్య జెనీవాలో శాంతియుతంగా పరిష్కారం కానిపక్షంలో ఇండో చీనా యుద్ధంలో ఇతరదేశాలు పాల్గొనక తప్పదని ఫ్రెంచి సైనికాధిపతి జనరల్ ఎలీ ప్రకటించాడు.

**ఆదివారం, మే 9:**

—ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో అభివృద్ధి కార్యక్రమాలు జిల్లాలవారీగా నిర్ణయించబడగలవని ప్లానింగ్ కమిషన్ రాష్ట్ర ప్రభుత్వాలకు సర్క్యులర్ ద్వారా తెలియపరిచింది.

**సోమవారం, మే 10:**

—ఆంధ్రరాష్ట్ర శాసనసభ వేసవి సమావేశం వాల్తేరు ఆంధ్రవిశ్వవిద్యాలయంలోని టి. లక్ష్మీనారాయణరెడ్డి హాలులో ప్రారంభమైంది.

—హిందువుల వివాహాలు, విడాకుల చట్టంపైన ప్రజాసభ చర్చ ప్రారంభించింది.

—అణుశక్తి ఉత్పత్తికి అవసరమైన ముడిపదార్థాలు ఆయా దేశాల ప్రభుత్వాల అధీనంలోనే ఉండాలి కాని ఇతర సంస్థల ఆధిపత్యాన్ని అంగీకరించరాదని పండిట్ నెహ్రూ పార్లమెంట్‌లో అన్నారు.

**మంగళవారం, మే 11:**

—దేవాలయ, ధర్మాదాయాల చట్ట సవరణకు బిల్లును ఆంధ్ర శాసనసభలో మంత్రి విశ్వనాథంగారు ప్రవేశపెట్టారు.

—రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణకై భారత ప్రభుత్వం నియమించిన ఫజల్ ఆలీ కమిషన్ మద్రాసులో విచారణ ప్రారంభించింది.

**బుధవారం, మే 12:**

—తిరుపతిలో శ్రీ వెంకటేశ్వర విశ్వకళాపరిషత్తు నెలకొల్పడానికి కొక బిల్లును ఆంధ్రశాసన సభలో విద్యాశాఖ మంత్రి పట్టాభి రామారావుగారు ప్రవేశపెట్టారు.

—ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్చేంజిలను శాశ్వతంగా స్థాపించి రాష్ట్ర ప్రభుత్వాల నిర్వహణకు ఒప్పగించాలని శివరావుకమిటీ సూచనలను నివేదిక పూర్తి పాఠంతోపాటు

## విషయానుక్రమణిక

ముఖచిత్రం:
శ్రీమతి అంజలీదేవి

మంత్రి గిరిగారు ప్రజాసభ సభ్యులకు అందచేశారు.

—తిరుపతి విశ్వవిద్యాలయం గురించి ఆంధ్రశాసనసభ కాంగ్రెస్ పార్టీ చర్చించింది. తీవ్ర అభిప్రాయభేదాలవల్ల ఎట్టి నిర్ణయం జరుగలేదని వాల్తేరు వార్త.

### గురువారం, మే 13 :

—కొరియా సమస్య పరిష్కారానికిగాను జనీవా సభలో బ్రిటిష్ విదేశాంగ మంత్రి ఈడెన్ అయిదు అంశాల విధానాన్ని సూచించారు.

### శుక్రవారం, మే 14 :

—ఫజల్ ఆలీ కమిషన్ మొత్తం 90 మందిని విచారణచేసి మద్రాసులో కార్యకలాపం ముగించుకున్నారు.

—భారత భూభాగంలో అన్య ప్రభుత్వాల అధీనంలో ఉన్న ప్రాంతాలకు నార్త్ అట్లాంటిక్ ట్రీటీ వర్తించదని పండిట్ నెహ్రూ ప్రజాసభలో ప్రకటించారు.

—పారమెంట్‌లో ప్రజాసభకు లోకసభ అని స్పీకర్ మవ్లంకర్ నామకరణం చేశారు.

—భారతదేశంలో ఫ్రెంచి ఆక్రమిత ప్రాంతాలను గురించి ఫ్రెంచి, భారత ప్రభుత్వ ప్రతినిధులు పారిస్‌లో సమాలోచనలు ప్రారంభించారు.

—పార్లమెంటు సభ్యుల జీత భత్యాలను పెంచుకుంటూ ప్రజాసభ ఒక బిల్లు ఆమోదించింది.

—భారత ప్రభుత్వంతో కాశ్మీర్ సంబంధ బాంధవ్యాలను గురించి జరిగిన ఢిల్లీ ఒడంబడికను కాశ్మీర్ రాజ్యాంగ పరిషత్తు సూచనపై పూర్తిగా అమలుజరుపుతూ రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాద్ గారు ఆర్డర్ ఇచ్చారు.

—హైడ్రోజన్ బాంబు ప్రయోగాలు ఈ సంవత్సరానికి ముగిసినట్లు అమెరికా దేశరక్షణ శాఖ ప్రకటించింది.

—ఇండోచీనా గురించి చర్చ జరపాలని పట్టుబట్టిన ఫ్రెంచి నేషనల్ ఎసెంబ్లీలో ప్రభుత్వంపట్ల విశ్వాస రాహిత్య తీర్మానం 2 వోట్ల తేడాలో వీగిపోయింది. (మే 6 వ తేదీని ఒక తీర్మానం వీగిపోయింది. అప్పుడు 49 వోట్ల తేడా.)

—ఆగ్నేయాసియా రక్షణ వ్యవస్థను స్థాపించడానికిగాను అమెరికన్ విదేశాంగ శాఖ సంప్రదింపు లింకా జరుపుతున్నదనీ, ఇండియన్, ఇండొనీషియన్ రాయబారులకు విడివిడిగా ఈ సమాచారం తెలియపరచబడిందనీ వాషింగ్‌టన్ వార్త.

—ఇండోచీనా యుద్ధంలో కొన్ని షరతులపై అమెరికా ప్రత్యక్ష జోక్యం కలిగించుకోగలదని అమెరికన్ ప్రభుత్వం ఫ్రెంచి ప్రభుత్వ ప్రతినిధికి తెలియపరిచిందని వాషింగ్‌టన్ వార్త. ఈ సందర్భంలో వాషింగ్‌టన్‌లో సమాలోచనలు జరుగుతున్నాయి.

—ఇండోచీనా సమస్య పరిష్కారానికి వియత్‌మిన్ సూచనలకు రష్యన్ విదేశాంగ మంత్రి మాలటోవ్ కొన్ని సవరణలు సూచించారు.

### శనివారం, మే 15 :

—శ్రీ వెంకటేశ్వర విశ్వకళాపరిషత్తు బిల్లును ఆంధ్రశాసనసభ సెలెక్టు కమిటీ పరిశీలనకు ఒప్పగించింది.

—పండిట్ నెహ్రూ విదేశాంగ విధానాన్ని లోకసభలో వివరించారు.

—తిరిగి ఇండోచీనాలో అమెరికా సైనిక సహాయం ఫ్రెంచిప్రభుత్వం కోరినట్లు వాషింగ్‌టన్ వార్త.

—ఆంధ్రమంత్రివర్గపక్షాలన్నీ కలిసి ఒక పార్టీని నెలకొల్పాలని వివిధపార్టీల సభ్యులు నిర్ణయించారు

### ఆదివారం, మే 16 :

—ఫ్రెంచి ఇండియాలో ఫ్రెంచి అధికారంనుండి విడివడిన ప్రాంతాల పరిపాలనకై అక్కడి నాయకులు ఒక కౌన్సిల్ స్థాపించారు.

—రాష్ట్రపతి ఉత్తరువు ఇచ్చినంత మాత్రాన కాశ్మీర్ గురించి ఐక్యరాజ్య సమితికి భారత ప్రభుత్వం ఇచ్చిన వాగ్దానాలను పాటించరని భావించకూడదని పండిట్ నెహ్రూ ప్రకటించారు.

—ఇండోచీనా సమస్య పరిష్కారానికై జినీవాలో తొమ్మిది రాజ్యాలూ రహస్యసమావేశం జర్పాయి.

### సోమవారం, మే 17 :

—ఆంధ్రశాసనసభ స్పీకర్ పై అవిశ్వాస తీర్మానాన్ని ప్రతిపాదించడానికి కనీసం 50 మంది సభ్యులైనా కోరుతున్నట్లు లేచి నిలబడితేగాని సభ అనుమతి పొందిన ట్లవదనే కారణంపైన నాగిరెడ్డి మరికొందరు తెచ్చిన తీర్మానాన్ని డిప్యూటీ స్పీకర్ త్రోసివేశారు.

—ఆస్ట్రేలియాలో కమ్యూనిస్టుల గూఢచర్యలను గురించి రాయల్ కమిషన్ విచారణ ప్రారంభించింది.

—జినీవా సమావేశం ఇండోచీనాలో యుద్ధవిరమణను సాధించగలిగినట్లయితే భారతప్రభుత్వం అక్కడ శాంతి భగ్నం కాకుండా కాపాడ్డానికి సమ్మతించవచ్చునని అమెరికాలో భారత రాయబారి జి. యల్. మెహతా ప్రకటించారు

—జినీవా సమావేశం అటో ఇటో తేలే

(56-వ పేజీ చూడండి)

# కాలక్షేపం

"ఉరుతర పర్వతాగ్రమున నుండి
పృథుంబగు రాతిమీద స
త్వరముగ ద్రెళ్లి కాయము
హతంబుగ జేయుట మేలు;-గాలి మే
పరిదొర వాత గేలిడుట బాగు;-
హుతాశనమధ్య పాతమున్
కరము శు;- జారుశీల గుణ
వర్జన మర్త్యుగాదు మాడగన్-"

తా॥ ఎత్తయిన పర్వత శిఖరమునుండి కఠినమయిన రాతిమీద వేగముగా దుమికి శరీరమును హతంజేయడం మేలు; - లేదా సర్పముయొక్క నోటి లో చేయిపెట్టుట మంచిది; - లేదా అగ్నిమధ్య పడుట మంచిది - కాని నీతిమార్గ ప్రవర్తనను విడిచి పెట్టుట మాత్రము వివిధముగా ఎంపి చూచి నప్పటికీ యోగ్యము కాదు.

నీతిమార్గమియేదో ధర్మమార్గము ఏదో తెలిసికొనడం సులభమైన పనికాదు "ధర్మ గతి క్లిష్టమయంచు నడక" వంటిది. "అటు నెవ్వన జ్ఞాతిసోదరులైన కౌరవులుగూ, వారి అనుచరవర్గముగూ కత్తులు కటారులతో నిలువబడియున్నారు. గురువులైన పూజ్యులైన భీష్మాచార్యులు, ద్రోణాచార్యులు, కృపాచార్యులు నిలువబడి యున్నారు ద్రోణాచార్యులవారే ప్రత్యక్షంగా, అత్యంత శ్రద్ధాసక్తితో విలువ లేని విలువిద్యలోని పలు రహస్యాలు నాకు నేర్పి, గురువును మించిన శిష్యుణ్ని గా నన్ను చేశారు అటువంటి మహామహులైన పూజ్యులగు గురువులమీదను, జ్ఞాతిసోదరుల మీదను బాణవర్షాలు కురిపించి వారి ప్రాణాలు తీయడం ధర్మమేనా? ఇది

దాసు వామనరావు

రాజనీతియేనా? లోకము మెచ్చునా? తగునా? న్యాయమగునా?" అని ఆనాటి ఆహవరంగములో అర్జునుని మనస్సు తల్లడిల్లిపోయింది. చేతిలోని ధనుర్బాణములు క్రింద పడిపోయినాయి. మనిషిని అధైర్యం ఆవేశించిది. కాళ్లు చేతులు పట్టు తప్పినట్లుగా స్తంభించిపోయినాయి. మనిషిలో నుంచి చేతనం పీడిపోయినట్లయింది. చేతిలోని అమ్ములుకూడా చేజారినవి. చేత నమ్ములు పీడ, చేతనమ్ములు పీడేనన్నట్లయింది. ఇదంతా, యీ అర్జున విషాదావస్థ అంతా, ఎందుకు ఏర్పడింది అంటే, ధర్మమార్గం ఏదో తెలియక పోవడంవల్ల ఏర్పడింది. ఆల్జీబ్రా లెక్క (బీజగణితంలోని లెక్క) ఎట్లా చెయ్యాలో పరీక్షలో తెలియక తికమకపడుతున్న విద్యార్థికి ఒళ్ళంతా చెమటలు పోసినట్లుగా అయింది. అల్జీబ్రా లెక్కవల్ల కలిగేగాబరాకంటె ఎక్కువ గాబరా ఆ గాండీవి గాబరా అనిగ్రహించాలి. ధర్మమార్గం ఎదో తెలియక తికమక పడడమే మానవునిజీవితయాత్రలో ఉన్న వడిదుడుకు నడక గొడవ అర్జున విషాదంలో కలిగిన తర్జన భర్జన ప్రతి మానవుని జీవితంలోనూ అంతర్గర్భితంగా ఉంటూనే ఉంది. అయితే, అర్జునుడు అనే అదృష్టశాలికి విశ్వరూపం చూపించి, "ధర్మమార్గం ఇదిగో!" అని చూపిన శ్రీకృష్ణ పరమాత్ముడు లభించాడు. "తారక మంత్రము కోరిన దొరకెను, ధన్యుడనైతిని గా" అని అర్జునుడు ఆ సమరరంగంలో అప్రతీప ప్రతాపుడై, సమరనిశ్శంకుడై ధర్మ ప్రతిష్ఠాపనార్థం ధ్వజమెత్తి విజయుడైనాడు. భారతయుద్ధం అంటే "ధర్మవిజయం" అని నిరూపించాడు. ఆనాటి మహా "జయం" అంటేనే "మహాభారతం" అని అన్వయించింది లోకం. మహాభారతయుద్ధంమూలంగా మనకు లభించింది ఏమిటంటే అర్జునునకు శ్రీకృష్ణుడు బోధించిన "భగవద్గీత" అన బడే ధర్మోపదేశం.

భారతదేశ స్వాతంత్ర్యంకోసం భారతీయులలో కాంగ్రెసుపక్షీవలంబు లందరూ ఏకమై సత్యాగ్రహసమరం చేశారు. ఈ భారతీయులలోనే కొన్ని పక్షాలవారు కొన్ని వర్గాలవారు ఆనాడు యీ స్వాతంత్ర్య సమరానికి వ్యతిరేకులై ప్రతికూలురై నిలవబడ్డారు. జస్టిసుపార్టీవారు వ్యతిరేకులైనారు. ప్రభుత్వోద్యోగులు వ్యతిరేకులైనారు. మన భారతీయ పోలీసుభటులే మన కాంగ్రెసు

నాయకులపై లాఠీచార్జీలు చేశారు. అటువంటి సందర్భంలో ఒక పోలీసు ఇనస్పెక్టరు తన బూట్సు కాళ్ళక్రింద మరొక భారతీయుని త్రొక్కడంలో వింత లేదు. అప్పుడు ఆ పోలీసు ఉద్యోగి తాను మహాయోధుడనని గర్వించి ఆపని చేశాడు. తన పోలీసు ఉద్యోగ ధర్మములను తాను సక్రమంగా నిర్వర్తించడమే సవ్యమని దివ్యమని భావ్యమని ఎంచి సత్యాగ్రహులను పీడించాడు. కాని, అతడు చేసింది నీతి కూలినపనియని అంతరాత్మలోనైన రవ్వంత చింతించలేదంటారా? అతని పొట్టకూటికి, నిజదారసుతోదర పోషణకు జీతబత్తెములనిచ్చేది ఉద్యోగం. జీవిత సౌఖ్యం యిచ్చేది పైసా - ఆ పైసాలో



తొలిఫలం

## కాలక్షేపం

నిషా ఉంది. ఆనిషాలో నిమునిషి, నిషాదునివలె ప్రవర్తిస్తాడు. చెక్కుచెదరకుండా చిత్తుగా త్రాగి కైపెక్కినవానికి ఆ నిషాలో అర్జున విషాదం ఎప్పుడూ కలుగదు ఈ కాలంలో యుద్ధరంగంలోని ఏదైనా కోటలోగాని నగరంలోగాని, శత్రుశిబిరంలోగాని అతిసాహసంగా చొరబడి; తుపాకీ మొనలకున్న సన్నీలతో శత్రుసైనికులపై, కలియబడి ఒకరి నొకరు పొడుచుకొనుచు నరుకుకొనుచు సంకులసమరం చేయవలసిన సందర్భములలో, ఉక్కుముక్కలవంటి సైనికులను ముందుకు ఉరికిస్తారు. వాళ్ళనే "షాక్ ట్రూప్స్" అంటారు. వాళ్లు యమవీరులు ముందడుగు వేస్తే పిడుగులవలె మీద పడ్తారు. వీళ్ళు ముందుకుపోయేటప్పుడు "అశ్వరథ" అని దూకుతారు. వీళ్లకు ఆ సమయంలో శివమెత్తినట్లుగా బాగా వీరావేశం కలుగుటకోసం ఆ సోల్జరులచేత ముందుగా సారాయి తాగిస్తారు. ఆకైపుమీద క్రిందుమీదు తెలియకుండా ముందుకు దుముకుతారు. ఇదంతా యుద్ధ తంత్రం - ధర్మాధర్మవిచక్షణ జ్ఞానం అటువంటిసందర్భంలో ఎంత తక్కువైతే అంత మంచిది.' యోధుడైనవాడు, సమర రంగంలోకి వచ్చిన తర్వాత "నేను యీ యుద్ధం చేయను - ఇదంతా అధర్మ యుద్ధంగా అక్రమయుద్ధంగా నాకు కన్పిస్తోంది!" అని వాదించి తనవారితో ఏకీభవించక భేదించినట్లయితే వెంటనే అటువంటివానిని యుద్ధరంగంలోనుంచి వెళ్ళిపోనివ్వరు సైనికాధికారులే అప్పటికప్పుడు తుపాకీ పేల్చి కాల్చి చంపివేస్తారు నిజంగా అర్జునుడు చేసినపనిని, ఆ రణరంగంలోని మరొక సైనికుడు చేసి అర్జునవిషాదమును తాను కూడా అనుకరించినట్లయితే, కురుక్షేత్రంలో మాట ఏమోగాని, ఏ కొరియాక్షేత్రంలోనైనా అయితే, అప్పటికప్పుడే అతని సైనికాధికారి బందూకు బారుచేసి, దర్జాగా నిలువబడిన సోల్జరును నిర్జీవుణ్ని చేసేవాడు. ఇంగీషులో సోల్జర్ అంటే సైనికుడు అని అర్థం. (Soul)అంటే ఇంగ్లీషులో ఆత్మ అటువంటి సోల్జరు ఆ సందర్భంలో సోల్ జారిన సోల్ జరు అవుతాడు.

అయితే, సోల్జరు అయినవాడు యుద్ధం వచ్చేముందు కూడా "యీ యుద్ధానికి నేను రాను" అని భీష్మించడానికి అవకాశం లేదు అటువంటి ధిక్కారం చేస్తే అది అధికారధిక్కారం అంటారు. సిపాయీల తిరుగుబాటు అంటారు క్షత్రియ ధర్మం అంటే అటువంటిది. అదివరకు యుద్ధంలేని కాలంలో అనేక సంవత్సరాలుగా ప్రభుత్వముయొక్క జీతబత్తెములను స్వీకరించి, హాయిగా ఆరగించి, యుద్ధం వచ్చేసరికి "మేము రాం! - మేము రాం!" అని సేనాధిపతికి ", ం! రాం!" అంటే, సేనాధిపతి సహించడు అతని చేతిలోని రివాల్వరు వారిమీద "ఢాం! ఢాం!" అంటుంది వెంటనే. యుద్ధరంగంలోకి సేనలను నడిపించుకొనివెళ్ళి, ఆ సేనలను నమ్ముకొని యుద్ధం సాగించవలసి ఉంటుంది. అటువంటి సమయంలో ఆ సేనలోని సైనికుడు ఎవడైనా నేను శత్రువుల మీద తుపాకులు కాల్చను అని ఎదురు తిరిగినట్లయితే, వాడు వెంటనే దేశద్రోహి అవుతాడు వాడు శత్రు సైనికుల పక్షంకూడా చేరవచ్చు.

గడచిన మహాసంగ్రామంలో నార్వేదేశం మీదకు హిట్లరుయొక్క జర్మను సేనలు దండయాత్ర సాగించినప్పుడు నార్వే ప్రభుత్వ సేనాధిపతియైన క్విస్లింగ్ అనేవాడు జర్మనుల నెదిరించి యుద్ధం చెయ్యడం మాని వేశాడు. జర్మనుల పక్షమునకు తన సేనలు తిరిగిపోయేటట్లు చేశాడు తాను తెల్లజెండా ఎత్తి 'వెళ్లండి కోటలోకి' అని జర్మనులకు ఆకుపచ్చ జెండాకూడా చూపించాడు.

"క్విస్లింగ్" పేరు స్థిరంగా ఆంగ్లభాషా నిఘంటువులో అచంద్రతారార్కమైపోయింది. నార్వేదేశాన్ని జర్మనులకు హస్తగతం చేసిన దేశద్రోహి యీ "క్విస్లింగ్" అనే కళంకము, కడిగినా పోని కళంకము, పుట్టుమచ్చవలె ఏర్పడింది అతడు అదివరకే అనేక సంవత్సరాలనుంచీ జర్మను ప్రభుత్వపు ద్రవ్యం రహస్యంగా తింటూ ఉన్నాడనిన్నీ, అందువల్లనే అటువంటి యుద్ధసమయంలో, అటునుంచి యిటు తిరిగి దేశాన్ని శత్రువుల కధీనము చేశాడనిన్నీ, వార్తలు విస్తరించాయి లోకమును మాయొటకు మూకుడున్నదా? అతనికి అంత ద్రవ్యదాహము లేకపోతే ఇంత దేశద్రోహం ఎందుకు చేస్తాననాన్నారు ఆ ద్రవ్యం తిన్నవాడు అది భాగ్యంఅని ఎంచి ఆపని చేశాడు. హిట్లరుసొమ్ము తిని, హిట్లరును ఆ సమయంలో ఎదిరించి ద్రోహం చేయడం న్యాయం కాదని ఆ రణధోరణి అనుసరించాడు. అయితే, అంతకుపూర్వమే నార్వే ప్రభుత్వపుసొమ్ము కూడా తిన్నాడు. కాని నార్వే ప్రభుత్వానికి ద్రోహం చేశాడు. అటువంటి క్విస్లింగులు మానవలోకంలో, జీవితం అనే నిత్యకృత్యసంఘర్షణాలలో, ఎంచి చూచినట్లయితే, లెక్కకు మిక్కిలిగా ఉంటారు

ప్రభుత్వంసొమ్ము తింటున్నాము గనుక సర్కారువారి ఉప్పు (నమ్మక్) తింటున్నాము గనుక, సర్కారువారు చెప్పినపని చేసితీరాలి అని వాదిస్తారు కాని, తాము తినే సొమ్ము ఎవరిది? అనేవిషయం మరింత మథించి శోధించాలి. ప్రజలసొమ్మును ప్రభుత్వం వసూలుచేసి ప్రభుత్వోద్యోగులకు జీత బత్తెముల క్రింద యిస్తోంది కనుక, యీ ఉద్యోగులు స్వీకరించేది, అనుభవించేది ప్రజల ద్రవ్యం - కాబట్టి ప్రభుత్వోద్యోగులు ప్రభుత్వానికి ద్రోహం చెయ్యకూడదనే విషయంకంటె, ప్రజలకు ద్రోహం చెయ్యకూడదనే విషయం ప్రతినిమిషం ప్రతి ఉద్యోగి ప్రత్యక్షశ్రుతిప్రమాణంగా మననం చేయాలి. అనిశంగా మననం చేసిన యోగి అసలైన ఉద్యోగి. ఆ మననం, ఈ భావం లేని ఉద్యోగిలో ప్రభావం అభావం. ఈ సత్యం గ్రహించని అధికారులు ప్రజలకు అధికారులు.

ఈనాడు అవినీతిని లంచగొండితనమును మాన్పించవలెననే మాటలు బాహాటంగా విన్పిస్తాయి కాని, చాటుమాటుగా సాగే అవినీతి, ఆ శబ్దములకు ఆ నినాదములకు భయపడి పారిపోతున్నట్లుగా కన్పించదు. అనేక ఆఫీసులలో ఎలుకలు పందికొక్కులు ఉన్నాయంటారు. కర్నూలులోని ఆంధ్ర



"రాగబంధము"

ప్రభుత్వ కార్యాలయంలో యిటీవల భీషసర్పం కూడా త్రాచుపాము కూడా నిర్భయంగా నివాసం ఏర్పరచుకొంటే దానిని సంహరించడం సంభవించింది. ఎక్కడ ఉండే జీవరాసులు అక్కడే బ్రతుకుతూ ఉంటాయి. "వంటయింటి కుందేలు లేది ఎందు బోగలదు?" అన్నట్లుగా అనేకములైన వంటయింటి కుందేళ్లు ఒంటరిగానో జంటలుగానో తమకుచిక్కినది మెక్కుతూ ఉంటాయి అయితే, "అవినీతిని నిర్మూలించాలి" అనే నినాదమువల్ల కుందేళ్ళు భయపడి పారిపోగలవా? అనేది అనుమానం.

కడుపునిండా తిండి లేకపోవుటచేతనే, ఆకలిబాధచేతనే జంతుజాలంలో ఒక జంతువును యింకో జంతువు స్వాహాచేసి ఆరగిస్తోంది. చిన్నచేపను పెద్దచేప మింగుతోంది. పెద్దచేపను తిమింగిలము మింగుతోంది. ఈ విధంగా మింగడం అవినీతి అంటామా? నీతి అంటామా? అవినీతి లేని జంతు రీతి చెట్టుమీది జామకాయ ఉడత కొట్టివేస్తుంది. అది దొంగతనం కాదు. బాహాటంగా తింటుంది. నిర్భయంగా ఆరగిస్తుంది. దానికి ఆ కొమ్మమీద కూర్చుండి తిన్నదే సంపాదన. ఆ పైసంపాదన కాకుండా వేరే క్రింది సంపాదన అనేది లేదు. కాని, ఉద్యోగులకు క్రింది సంపాదన కాకుండా పై సంపాదనకూడా ఉన్నట్లయితే, ఉడతలతో ఉపమానం చెప్పడం ఉడతలకే అవమానం. శ్రీరాములవారు మెచ్చి మచ్చిక చేసిన ఉడతలవి. కాని, ఉద్యోగుల కవినీతి

(55-వ పేజీ చూడండి)

[1940 లో 'ఫ్రూషా' రచించిన పద్యాన్ననుసరించి, 'ఫ్రూషా' యే రచించిన రేడియో రూపకం.]

[పడక కుర్చీలో నడుం వాల్చి సోమేశం పగటికలలు కంటూ వుంటాడు; పక్కనే గడపని తల ఆనుకుని అతని భార్య రాజ్యం కునుకు తీస్తూవుంటుంది :]

సోమేశం :

ఇది యెండిన మెండి మధ్యాహ్నం
మది యెండిన బండ మధ్యాహ్నం
హృది మండిన యెండు మధ్యాహ్నం...
మట్టి గోడమీది కొబ్బరి మట్టలు
ఆడే నల్లని జాడల నడుమను
మిట్ట మధ్యాహ్నపు తెల తెల్లని
కదిలే యెండ పొడలు......
గదిలోపల కలగా వెలుతురు—
ఈజీచైర్ లో నా నీడకలతలు—
గోడమీద గొలుసుల బొమ్మలు......

[గోడమీది గొలుసుల బొమ్మలలో తన పొద్దుటి అనుభవాలన్నీ నెమరుకు వస్తాయి - సోమేశానికి ]

బాబయ్య : ఎంతకాలమూ ఒకళ్ళమీద ఆధారపడి నెట్టుకు పోదామనుకుంటే ఎన్నాళ్లు సాగుతుందిరా అబ్బాయ్? ఎన్ని సార్లు చెప్పినా నీ ఖర్చులు తగ్గించుకొమ్మనీ- నీ వూహాలు నేలమీదకు దించుకొమ్మనీ...

సో: (స్వగతం) ఖర్చులు తగ్గించుకొమ్మంటాడు బాబాయ్. ఊహాలు నేల మీదకు దించుకొమ్మంటాడు బాబాయ్. రాబడే లేనివాడికి తగ్గించుకోడానికి ఖర్చులేంవుంటాయో? ఆశలే కరువైన వాడికి వూహాలేంవుంటాయో. అది ఆలోచించడు బాబాయ్. అద్దె పంచ కొంపురంలో ఆరోగ్యాలు నిలబెట్టుకోడానికే ప్రాణాయామమై పోతుంటే ఖర్చులు తగ్గించుకుని కార్పణ్యం చూపించమంటాడు బాబాయ్.

బాబాయ్: ఎరుగున్న జమీందార్ స్నేహితుడికి సిఫార్సు ఉత్తరం ఇచ్చి ఉద్యోగం ఇస్తాడు మాసిరారా అంటే, ఏంచేశావురా సోమేశం?

సో: (స్వగతం) ఎంత జమీందారైనా- కష్టపడి చదివి గ్రాడ్యుయేట్ అనిపించుకున్న వాడికి, ఏవో వూహాలూ, ఆశయాలూ, కవితా ధోరణులూ ఉన్నవాడికి ఏ ప్రైవేట్ సెక్రటరీ పనో చూపించాలి గాని, గుమాస్తా పని చేస్తావా నువ్వు- టైపూ షార్ట్ హేండూ తెలుసునా, ఇవేమీ చెయ్యలేకపోతే మోటార్ కార్ల మెకానిజమేమైనా తెలుసా? కార్లు కడగడం తెలుసా? అని ఇవన్నీ అడిగితే ఒళ్ళుమండదూ మరి?

బా: పనికి బద్ధకం, పొగరుమోత్తనం ఉండేవాడికి కరస్తుని ఉద్యోగం ఎవడిస్తాడు? నీ కర్మ అంతేలే

సో. (స్వగతం) అంటాడే కాని, ఏవిటి - నీ యింట్లో బియ్యం వున్నాయా? డబ్బేమైనా ఖర్చుకి కావాలా? మొగం వేలేసుకొని ఏం వచ్చేవు? మా ఆవిడని తీసుకొచ్చావు గాదేం. తమ్ముడూ చెల్లెలూ కులాసాగా చదువుకొంటున్నారా. అనేమీ అడగడం తనంతట తనకి తోచనే తోచదు బాబయ్యకి.

బా. ఏవిరా ఏవిటి? ఎందుకు వృధా ఆలోచనలు? మిట్టమధ్యాహ్నం అవుతోంది. అది నీకోసం కనిపెట్టుకు నుంటుందేమో వెళ్లు.

సో: నాకోసం కనిపెట్టుకోదు - డబ్బు కోసం.

బా: అదిగో వెధవమాటలు నేర్చేవు వెధవమాటలు. ఈ చదువుకున్న దానికి ఫలితం ఇదే. అదేమో నీకోసం కనిపెట్టుకుండదు - డబ్బుకోసం కనిపెట్టుకునుంటుంది - అలాగే నువ్వు నాకోసం రాలేదు. నా డబ్బుకోసం వచ్చావు అంతేనా?

సో: (డగ్గుత్తికతో కళ్ళనీళ్ళ పర్యంతమూ అయి) మన సంబంధాలు అంతే అనుకుంటాను, బాబాయ్. ఆ డబ్బు ముడి ఏమాత్రం బెసికినా మన సంబంధాలు ఉండీ లేనట్టే నేమో.

బాబా: అంత ఉండీ లేనట్టుండే సంబంధాలకోసం ఎందుకీ పాకులాట, వెధవ దేవుళ్ళాటానూ. వెన కిచ్చిందేదో ఇచ్చాను. నీ విశ్వాస ఘాతుకత్వానికి నేనికమీద ఇయ్యబోయేదేమీ లేదు వెళ్ళు.

సో: (ఉద్వేగంతో) వెనకిచ్చిందాని కల్లా అప్పుగా పత్రం రాయించావుగా బాబాయ్. అలాగే మరి కొంతేమైనా ఇచ్చి - పత్రాన్ని పెంచుతావేమో అని.

బా. పత్రాన్ని పెంచుతాను నువ్వు తేరగా తీర్చే మొగాడివని. అప్పుగా పత్రం రాయించానని. అప్పుగాను. చెప్పొచ్చాడు. అప్పనంగా ఇయ్యవలసిందీయన గారికి. ఇప్పుడు చేతులో నీకియ్యడానికేమీ సిద్ధంగా లేదు వెళ్ళు.

సో బాబాయ్ ..

బా: వెళ్ళవోయ్ - వెళ్ళంటే వెళ్ళు - నేను త్వరగా వీధిలోకి వెళ్ళాలి.

డ్రైవర్ : కార్ రడీ సార్.

సో: (ఖిన్నుడై) బాబాయ్, నువ్వే దోవని వెడుతున్నావ్?

బా: మీ యింటి దోవని వెళ్ళటంలేదు. కార్ స్టార్టు చెయ్ డ్రైవర్.

[కారు స్టార్టు అయి వెళ్ళిపోతుంది. ఎలెక్ట్రిక్ హారన్‌తో క్రాస్‌ఫేడ్ అవుతూ మునిసిపాలిటీ సైరను మోత ఒక అరనిముషమో ముప్పావు నిముషమో వినపడుతుంది]

బిచ్చగాడు: బాబూ ఒకకానీ ధర్మం ఇప్పించండి - మీ కాలికి మొక్కుతాను - ఒక కానీ ధర్మం ఇప్పించండి బాబూ - మీ కాలికి మొక్కుతాను - ఒక కానీ.

సో: ఉండు ఉండు - వదులు వదులు - కాలు వదల వేంఖర్మ అసలే తెగిపోయిన చెప్పుల్తో కాళ్ళీడ్చుకుంటూ వస్తుంటే యీ దరిద్రుడి కాలే దొరికిందా నీకు పట్టుకోడానికి?

బి. (ఏడుస్తూ) అయ్యబాబయ్య బాబు. అలా అనకండి బాబూ - మీరు దరిద్రులేంటి బాబూ. గర్భదరిద్రుణ్ణి నేనేనండి - పొద్దుణ్ణించి ఒక్క బాబొక్క కానీయియ్యలేదు. మీరయినా ఇయ్యండి బాబూ. ఒక్క కానీ ధర్మం ఇప్పించండి - మీ కాలికి—

సో: (ఎగిరి గంతేసి) అదుగో. చెస్తే నీకొక్కడూ. అలా కాలుపట్టుకోకు, నీకు పదివేల నమస్కారాలు. నేనిప్పుడు నీకు బిచ్చం వేసే పరిస్థితిలో లేను, నన్ను వేధించకు.

బి: ఎందుకు బాబూ. ఆ తప్పించుకునే మాటలు? సిరిగల మా రాజు మొహం తెలీదా? బాబూ - ఒక్క కానీ ధర్మం ఇప్పించండి. బటానీలో సెనగపప్పో కొనుక్కు తిని కడుపు నింపుకుంటాను - ఒక్క కానీ ధర్మం - బాబూ మీ కాలికి మొక్కుతా.

సో: (పరుగెత్తి పారిపోతూ) మొక్కద్దు బాబూ నా కాలికి మొక్కద్దు (దూరాన) రాజ్యం - రాజ్యం - తలుపు తియ్యి - రాజ్యం, రాజ్యం తలుపు తలుపు...

బి: (క్రమంగా దగ్గరవుతూ) రాజ్యాలు గల మా రాజు, పెట్టిపుట్టిన మా రాజు, సిరి గల మా రాజు, ఆ తల్లితో చెప్పి పట్టెడన్న మైనా పెట్టించు బాబూ

సో త్వరగా తలుపు తియ్యి రాజ్యం త్వరగా తియ్యి.

రాజ్యం: వస్తున్నా - (తలుపుతీసి) వచ్చి తలుపు తీసీదాకా అంత తొందరేవిటండీ.

సో: తొందరే మరి. మనపాలిటి అదృష్ట దేవత తరుముకువస్తోంది.

రా: (నిద్రబద్ధకంగా) ఏవిటీ. డబ్బు తెస్తున్నారా ఎవరైనా, మీరే తెచ్చారా (ఆవలించి) మీ బాబయ్య ఇచ్చారా.

సో. డబ్బు డబ్బు. డబ్బు. ఎవళ్లూ తేవటము లేదు నేనూ తేలేదు. అడుగో చుట్టం వొచ్చాడు తలుపువేసుకొని పొమ్మంటావో ఆయన్ని లోపలికి ఆహ్వానిస్తావో నువ్వే చూసుకో.

బి: సిరిగల తల్లి, పెట్టిపుట్టిన మా రాజు, ఒక్క అన్నం పిడచ పెట్టించమ్మా. ఆ ధర్మ రాజు చూసిచూసి కానీ ఇయ్యలేక పోయాడు. నువ్వేనా కూంత అన్నం పిడచ పెట్టమ్మా ధర్మతల్లీ.

రా: రమ్మన్నారు తిమ్మన్న పంక్తికి. జోగీ జోగీ రాసుకుంటె బూడిద రాలిందట. వెళ్లు నాయనా. మిట్టమధ్యాహ్నం కాని నీకు అడుక్కోటానికి తీరిక లేదా? నీకు పెట్ట డానికి మేమేమీ వండుకు సిద్ధంగాలేం వెళ్ళు.

బి పొద్దుటేలనుంచీ ఒక గింజయినా, ఒక్క కానయినా దొరకలేదు. ధర్మతల్లీ నీ కాలికి మొక్కుతా.

[అంటూండగానే తలుపు దభాలున వేసిన చప్పుడు. వీధిలో ఉండుండి “ధర్మ తల్లీ - సిరిగల మారాజా. పెట్టి పుట్టిన మారాజా - రవంత అన్నం పెట్టించు మా తల్లీ” అని వినిపిస్తూ వుంటుంది ]

సో. అమ్మయ్యా తలుపేశేశావా? నే నింక ఈజీచైర్ లో కూలబడతా.

రా: అవునుగాని పొద్దున్ననగా వెళ్ళి ఇప్పుడొస్తే ఇంట్లోవాళ్లు ఏమైపోయేట్టు చెప్పండి. ఏంచేసుకొచ్చారు ఇంతకీ.

సో: వేశావూ ప్రశ్న? అలా వ్యధికరణంగా వెయ్యకపోతే నేం? వీధిలోంచి అలిసి వచ్చావు, మంచినీళ్లు కావాలా? మంచి నీళ్లైనా - పోనీ - చొక్కా విప్పుకొని ఇలా తెండి - మొఖం అలా వాడిపోయివుందేం - ఇవేమీ అడక్క, అలా సాధింపుగా మాట్లాడితే వీధిలోకి పోయొచ్చే మగాడు బతకడం ఎలాగ రాజ్యం?

రా: (కళ్లనీళ్లు గుక్కుకుంటూ) ఇంట్లో బతుకు మట్టిగడ్డలుగా వుంటే వీధిలోనైనా బంగారం చేసుకు వస్తారేమో అని ఆశపెట్టుకుని అడగడంకూడా తప్పటండీ? నేను మాట్లాడితేనే మీకు పోట్లాడుతున్నట్టుంటే మాట్లాడనే ఆడను లెండి.

సో: అసలు నే నేమన్నానని రాజ్యం. అలా కళ్ళమ్మట నీళ్ళు పెట్టుకుంటావు? వీధినిబడి తిరిగి తిరిగి వచ్చిన మగవెధవకి కొంచం సింపతీ చూపించమన్నా. అంతేగా? చూడు.

రా: నేనుమాత్రం ఏమన్నా నేమిటి? ఇంటిలో సతమత మవుతున్న ఆడపినుక్కి మాత్రం సింపతీ చూపనక్కర్లేదా అన్నాను.

సో: రైటే. నువ్వు చెప్పిందీ రైటే, నేను చెప్పిందీ రైటే, కనక, మనిద్దరం సంధి చేసుకుందాం. నాసంగతి గబగబా చెప్పే స్తాను. నేను వెళ్ళిన పనేమీ కాలేదు బాబాయి స్నేహితుడు మనకి దర్శనం ఇయ్యలేదు. బాబాయి అప్పు పత్రానికి కూడా డబ్బేమీ యివ్వనన్నాడు కాళ్లీడ్చు కుంటూ చక్కా వచ్చాను మరి నీసంగతి చెప్పు.

రా: నా సంగతి కేముంది. మీ తమ్ముడూ చెల్లెలూ సెలవులకి మీ అత్తయ్యగారింటికి వెళ్లేరు గనక, పొయ్యి రాజేసే అవసరం లేక పోయింది మరిది వూరికెళ్లేముందు కుళాయి దగ్గర ఇంటావిడతో ఘర్షణ పడ్డాడు. దాంతో ఆవిడ రెచ్చిపోయి మీఆయ నేడమ్మ; మూణ్ణెల్లనుంచీ అద్దియ్యకుండా మొహం చాటేసుకు తిరుగుతున్నాడు; ఎన్నాళ్ళని ఊరుకు నేది - సాయంత్రం లోగా ఏమైనా ఇస్తేనే ఇంట్లో ఉండనిస్తా లేకపోతే సామాన్లు వీధిలో పారేస్తాను అంటూ కూచుంది. నేను ఏడ్చేడ్చి నిద్ర పోయాను

[దూరంగా పక్కవాటాలో]

ఇంటావిడ. దిక్కుమాలిన సంత వూటకు గతిలేనివాళ్లు వచ్చి ఇంటిమీదపడ్డారు. చేరే ముందు అన్నీ నంగనాచి కబుర్లే చేరిం తర్వాత నెలకొద్దీ అద్దె బకాయి పెట్టడం. చూసిచూసి వెళ్లిపొమ్మన లేంగదా అని మొరాయింపు. ఎవళ్ళకి తెలియవూ వీళ్ళ యెత్తులన్నీను - ఎవళ్ల తాహతు వాళ్లకి తెలుసుండాలి. వేలుడున్నాడో లేదో వుక్ర నాగమ్మ కుళాయిదగ్గర గంటలకొద్దీ సొన్నం చేసి నీళ్ళన్నీ ఖర్చు పెడుతూంటే ఎవళ్ల బాబుగారి సొమ్మనీ చూస్తూ ఊరుకోడం? ఊరికి చక్కాపోయాడు సెలవలకి. స్థిమితంగా ఉండచ్చు కొన్నాళ్ళు. అద్దిచ్చుకోలేని యీ దిక్కుమాలిన సంత వదిలిపోతే బాగుండును, మరెవళ్లేనా ఉద్యోగులకిస్తే ఇంతకు నాలుగింతలు అద్దె దొరుకుతుంది.

రా: అదుగో వింటున్నారా ఆవిడే సణుగుడు పొద్దుణ్ణించీ ఇదే ధోరణి. ఆవిడి కోడలి ధోరణే వేరుగనక మన మింయింట్లో ఉండగలుగుతున్నాం గాని లేకపోతేనా?

సో ఏంచేస్తాం రాజ్యం? మన అదృష్టం అలావుంది. అది కలిసివస్తే పట్టుకున్నదల్లా బంగారమవుతుంది. ఇంతకీ మన కీవేళ ప్రాయోపవేశమేనా?

రా: ఇంట్లో కొంచం రవ్వ వుంటే ఉప్పిడిపిండి చేశాను. ఇంటావిడ కోడలు నాలుగు సపోటాపళ్ళిచ్చింది. వాటితో ఈపూట గడిపెయ్యొచ్చు.

[ప్రక్కయింటి రేడియో]

ఒకగొంతు: పారిశ్రామిక సంస్థల నిర్వహణ విజ్ఞానంలో పట్టంపొంది శిక్షణ నించి తిరిగి వచ్చిన శ్రీమంతుడి కుమారుడికి నగరంలోని పెద్దలంతా గొప్ప విందు చేశారు. రాష్ట్ర శాసనసభలో ప్రతి పక్షవర్గ నాయకుడు రాష్ట్రంలో తిండిలేక ఆకలి చావులు చస్తున్న వారి సంఖ్య ఎంతా అని ప్రశ్నించగా, ఆహారమంత్రి తమకు సమాచారమేమీ అందలేదనీ, వ్యవధి కావాలనీ అన్నారు. ఏ ఒక్క పౌరుడూకూడా నిరుద్యోగం చేత కాని, నిరాశ్రయంచేతగాని నిరాహారంచేత గాని బాధపడని శ్రేయోరాజ్యంగా మన దేశాన్ని తీర్చి దిద్దడానికి దేశంలోని యువజనులంతా పాటుపడాలని స్వామీ నిర్వచనానందులు ఉద్ఘోషించారు. (రేడియో చప్పుడు క్రమంగా తగ్గిపోతుంది.)

[కొంచెం ఉప్పిండి ఫలాహారం చేస్తాడు సోమశం ]

సో ఇంక చాలు - రాజ్యం మంచి నీళ్ళియ్యి.

రా: ఆ కాస్తతోటి ఏంకడుపు నిండు తుందండీ. ఆ మిగిలిందికూడా తినెయ్యండి.

సో అంతా తిన్నా నిండకపోవచ్చు. నిండవలిసింది ఒక్క కడుపు కాదు, రెండు. మిగిలిందాంతో నువ్వు కానీ

[కాకికూత]

రా. హుష్, హుష్ - పాడుకాకి నేను మంచినీళ్లు తెచ్చే ఇంతటిలోనే పళ్ళెంలో పిండివదిలేసి పడుక్కుర్చీలో చేరబడాలా. పాడు కాకి పిండి కాస్తా చెల్లా చెదరుగా తిన్నేసింది.

స. నక్కబావ కథలో కాకిబావకంటె ఇదేదో గడుగ్గుకాకి వుందిలే హుష్. హుష్......

రా: ఆ కుర్చీలోంచి కదలకుండా కొడితే అది యెగిరినట్టే ఇవేళకి.

## ★ ఎండిన మొండిమధ్యాహ్నం ★

[వాకిట్లో]
బాకీవాడు: సార్ - సార్ - సోమేశం గారూ.

సో. ఎవరు చూడు రాజ్యం. ఉత్తర మేమో.
రా: (మెల్లిగా) చిల్లర దుకాణం గుమాస్తా ఇవాళ పొద్దున్నప్పుడే రెండు సార్లు వచ్చి వెళ్లాడండీ

సో: ఉస్ - మాట్లాడకు, తిరిగి తిరిగి వచ్చి పడుకున్నారని చెప్పు.

(54-వ పేజీ చూడండి)

# చిన్నబోయిన చెన్నపట్నం

'చెడి చెన్నపట్నం చేరమ' నే వారు పూర్వం పెద్దలు అన్న ఆ మాట వూరికే పోనీయట మెందుకని కలకత్తా మెయిలులో వచ్చి చెడీ చెన్నపట్టణం చేరాను. మెయిల్లో నే నెక్కిన మహాత్మ్యమే నేమో – ఆరోజు రాత్రి మెయిలు కావలి దాటాక పట్టాలు తప్పి పరిగెత్తిపోయింది. మదగజంలాంటి కెనేడియన్ రైలు యింజనుకి తగిన మావటివాడు నాటి మెయిల్ డ్రైవరు. పట్టా తప్పి పారిపోతున్న రైలుబండిని 'ఖడేరావ్' అన్నాడు. కొస్తంతలో తప్పిపోయింది కాని, లేకపోతే యీ 'గుంటూరు గ్రామ కాపురస్థుడు' ఆరోజు కావలిలో ఆవులించి మృత్యువుని కావులించుకొనేవాడే!

అసలీ ప్రయాణమే చేయకపోగును. చిన్నప్పటినుంచీ అలవాటుపడినగుంటూరు-కొరిటిపాడు రోడ్డుమీదనే బోజాలు కొట్టుతూ తిరుగుతూవుందును – హైకోర్టు ఆగమనానికి మావూరు యింతగా మురిసిపోతుంటే, దాని నిష్క్రమణానికి చెన్నపట్నం ఎంతగా చిన్నబోతోందో చూసి సంతోషిద్దామనే చిలిపిబుద్ధి నా బుర్రలో పుట్టకపోతే!

ఎందుకైనా మంచిదని ముందుగా మైలాపూరికి వెదుక్కుంటూ వెళ్ళి తెలుగువాళ్ళ హోటల్లో అరవవాళు పెట్టిన అన్నం తిన్నాను. హైకోర్టుకి రెక్కలు వస్తే అది లేవి ప్లీడర్లదొక్కటే కొబట్టి వాళ్ల సంగతి ఎలావుందో తెలుసుకొందామని తొందర పుట్టింది. ఆ వుద్దేశంతో వూరంతా తిరిగి సాయంకాలానికి లజ్ కార్నరు బస్సుస్టాండులో చేతిసంచి పట్టుకు నిల్చున్నాను,– వచ్చే పోయేజనాన్నీ, ఆగకుండా పోయే బస్సుల్నీ చూస్తూ.

"ఏమండి రామారావుగారు – ఇక్కడ కూచ్చున్నారేం?"... నా వెనక ఎవరో ఎవరినో ప్రశ్నించారు.

"ఆఁ! ఏమీ లేదు. ఊరికె నే, కోర్టు కూడా లేదుగా పొద్దుణ్ణించి యింట్లో కూచునీ కూచునీ విసుగేస్తే, యింతకుముందే యిలా వచ్చాను. చెయ్యటానికి ఏమీ పని లేక, వూరికే చూస్తున్నాను" అన్నాడు రామారావుగారు. ఆయన నలభయ్యో పడి దాటిన మనిషి. చాలా కాలంపాటు లేమిని దాచటానికే శక్తినంతా ధారపోసిన వ్యక్తిలా కనిపిస్తున్నాడు.

"ఇంతకీ మీరు గుంటూరు ఎప్పుడు వెళ్తున్నారు?" అవతల వ్యక్తి అడిగాడు; అంతకంటె అడగటానికి మరేది తోచక

"వెళ్ళానండీ! మా అబ్బాయిని పంపించాను ఇల్లు చూడమని. వాడి దగ్గిరనుంచి వుత్తరం ఏదన్నా వస్తుందేమోనని చూస్తున్నాను."

"అది సరే కానిండి – హైకోర్టు గుంటూరులో పెట్టటం జరగకపోవచ్చునటగా?"

"అదేమిటండోయ్! కొంప ముంచేశారే హైకోర్టు యిక్కడా వుండక, గుంటూరికీ పోక మధ్యలో ఏమైపోతుందంటారు? బట్వాడా కాని వుత్తరంలా ఏ 'డెడ్ లెటర్ ఆఫీసు'కో చేరిపోదుగదా?"

"అబ్బ! అనేమీ కాదండి హైకోర్టు గుంటూరులో పెట్టాలని మన ఆంధ్ర ఎసెంబ్లీ చేసిన నిర్ణయానికి యింకా కేంద్ర ప్రభుత్వ ఆమోదం రాలేదట. ఆమోదం రావటానికి యింత ఆలస్యం అవటాన్ని బట్టి 'ఢిల్లీ దేవుళ్ళ'కి గుంటూరుమీద ఏదో కొనరాని కోపం వుందనీ, ఆ కోపంకొద్దీ వాళ్లు ఆ వూరికి యీ భోగం పట్టనివ్వరనీ అందరూ అనుకొంటున్నారు!"

"ఆఁ! అదేమిటండీ- అర్థంలేనిమాట. ఒక చెంపని గుంటూరులో భారీ ఎత్తున ఏర్పాట్లు జరుగుతున్నట్లు పత్రికల్లో ప్రతి రోజూ పడుతోంది కదండి?"

"అదేమో! ఈ వూళ్లో స్వంతయిళ్లూ ఆస్తులూవున్న పెద్దపెద్ద ప్లీడర్లలో చాలా మంది, హైకోర్టు యిక్కణ్ణుంచి అసలు కదలనే కదలదని అనుకొంటున్నారట."

"కదలకూడదని వారికోరిక లెండి. కదిలితే వాళ్లు కష్టపడి ఆర్జించిన ఆస్తులకి విలువ తగ్గిపోతుందనేదిగులుకొద్దీ వా రలా అనుకొంటున్నారేమో!"

"అయితే కావచ్చేమో–ఈవూరిప్లీడర్లలో చాలామంది కొత్తచోట ప్రాక్టీసు మళ్ళీ మొదలుపెట్టాలంటే భయపడుతున్నారల్లే వుంది?"

"భయమెందుకండీ! ఇప్పుడు మేమంతా వున్నామంటే ఎంతలేదన్నా హైకోర్టులో ప్రాక్టీస్ చేసినవాళ్లంకదా? మాకు వున్న ధాటీ, మాకు వున్న ఆ 'యిదీ' ఆ వూళ్లల్లో జిల్లా కోర్టుల్లోనూ, మునసబుకోర్టుల్లోనూ కొట్లాడుకునే ప్లీడర్లకి ఎలా వస్తుందండీ!– మీదంతా చాదస్తం కాని."

"మీ రేమిటో అంటున్నారు, కాని అక్కడి ప్లీడర్లకువున్న స్థానబలం మీకు రావటానికి ఎన్నేళ్లు పట్టుతుంది? స్థానభ్రంశం జరిగితే నఖదంతకేశములు రాణించవని 'పంచతంత్ర' కారులు అన్నారు కాని అంతకంటె మిన్నగా ప్లీడర్లు, డాక్టర్లు రాణించలేరు ... ఏమోలెండి! మన కెందుకొచ్చినగొడవ వెళ్ళొస్తాను. అందరూ కులాసాయేనా?"

"ఆ! ఆ! వెళ్ళిరండి."

అంతటితో వాళ్ల సంభాషణా ఆగిపోయింది. ఇదంతా వింటూవుంటే, యిష్టం లేనికోడలు అత్తవారింటికి పోయేముందు పెట్టే నస యిట్లాగే వుంటుందికదా అనిపించింది.

బీచికైనా పోదామని కచ్చేరీరోడ్డు వెంట పడిపోతున్నాను. వేసవిసాయంకాలం కావటంచేత కాబోలు – పిల్లా మేక అందరూ వుసిళ్ళు వచ్చినట్లు యిళ్ళల్లోనుంచి బయటకు బిలబిలా వచ్చేస్తున్నారు మస్తానయ్య వురుసు రోజున మా వూరి వీధులు ఎలా వుంటాయో యీ వూరివీధులు ప్రతిరోజూ అల్లా వుంటాయి కాబోలునని విస్తుపోతున్నాను.

"అబ్బబ్బ! ఇవ్వాళ ఏం ఎండ కాసిందండి – ఏం ఎండ కాసిందండీ! పిల్లలూ మేము అట్టుడికినట్లు వుడికిపోయామంటే నమ్మండి..." నాముందు మూడు గజాల దూరంలో నడుస్తున్న ఒక జట్టు పంచకట్ల వారిలోనుంచి ఒక కంఠం.

గుంటూరు ఎండకు అలవాటుపడిన నా ప్రాణానికి యీవేళ యిక్కడ వూటీలో వున్నట్లుంది. వీళ్లేమిటి చెప్మా-యీమాత్రం ఎండకే యింత హడిలిపోతున్నారు!

"అదేమిటండీ యీమాత్రానికే యింత కంగారు పడిపోతుంటే రేపు గుంటూరు ఎండకి ఎట్లా తట్టుకుంటారు?" అడగవలసిన ప్రశ్న అడిగాడు, ఆ జట్టులో మరొకడు.

"అబ్బబ్బ! మీరూ ఎత్తారా గుంటూరు సంగతి? అదేం చిత్రమో కానిండి–పొద్దున నిద్దరలేచింది మొదలు రాత్రి పడుకోబోయేలోగా కనీసం ఒకవందమంది అయినా అడుగుతున్నారు—'మీరు గుంటూరు వెళ్ళుతున్నారుకదా?' అని. వెళ్ళక ఏం చేస్తాం చెప్పండి! బతికినన్నాళ్లు యిక్కడ ప్లీడరు గుమాస్తాగిరి వెలిగించి యిప్పుడు అర్థాంతరంగా యింకో వుద్యోగం చెయ్యమంటే మా తరమా? హైకోర్టూ వెళ్ళిపోయి,

(58-వ పేజీ చూడండి)

# అమ్మ చాలా మంచిది

ప్రొద్దుటే ఏదో పనిమీద మేడమీద వరండాలోకి వచ్చిన యాలిస్ అలాగే నిలబడిపోయింది. జనవరి నెల మంచు బిందువుల్ని యింకా పూర్తిగా సూర్య కిరణాలు జయించలేదు. పై నుంచి చూస్తే యిటూ అటూ పేర్చబడిన కుండీల లోని తెల్ల చామంతిపూలు చల్లని గాలికి మెల్లగా ఊగుతున్నాయ్. దూరంగా ఉన్న పున్నాగ పుష్పాలు తమాషాగా ఒకటీ ఒకటీ నేల రాలుతున్నాయ్. పాత స్మృతులు మనసును కలవరపెట్టి, యాలిస్ కళ్లు అశ్రుపూరితా లయినాయి. దృశ్యమంతా మసక మసకగా కనిపించింది.

'పువ్వులంటే అంత యిష్టమెందుకమ్మా నీకు యాలిస్?' మిస్సమ్మ రాక యాలిస్ ఆలోచనలకి అంతరాయం కలిగించింది. ఆమె మొహాన్ని మిస్సమ్మ బలవంతాన తన వైపు తిప్పుకుంది. దగ్గిరగా లాక్కొని గట్టిగా ముద్దెట్టుకుంది.

'నా బంగారు తల్లి! ఎంత చక్కటిదాని వమ్మా! నాబిడ్డ 'రోజ్' బతికుంటే సరిగ్గా యింత వయస్సుదీ అయ్యేది' మిస్సమ్మ అయిదునిమిషాలు నిశ్శబ్దంగా దుఃఖించింది.

'అయితే యాలిస్, నువ్వింక పెళ్ళి చేసుకోవేమిటమ్మా? ఇంత చిన్న వయస్సులో యింత వేదాంతం నీ కెలా అలవడిందీ?'

యాలిస్ మనసు కలవరపడింది. ఈ 'గుడ్ ఫ్రైడే'తో తనకు యిరవైమూడేళ్లు వెడతాయి. ఈ వయస్సులో తన కీ వేదాంతం ఏ ఆశయ సిద్ధికోసం?

మిస్సమ్మ ప్రశ్నల కెప్పుడూ యాలిస్ మౌనమే సమాధానం. సమాధానం చెప్పకుండా యాలిస్ తన గదిలోకి గబగబా నడిచింది. గదితలుపు వేసింది. పెట్టితీసి అందులోంచి చిన్న దంతపు భరిణ తీసింది. అందులో సొమ్ము లెక్కపెట్టుకుంది. అయిదు వందల రూపాయిలు! ఆరేళ్ల కృషి!

యాలిస్ గది బయకు నడిచింది. గది తలుపు తాళం వేసింది. మేడమెట్లు దిగి క్రిందకు వచ్చింది. చల్లగాలికి ఎగురుతున్న మప్లరును దగ్గిరగా బిగించుకుంది. టెంకిస్ మొక్కలనూ క్రోటన్సు మొక్కలనూ దాటింది. అందంగా కత్తిరించిన పూలతలను దాటి ఒక ఫర్లాంగు నడిచింది. మలుపు తిరిగి చిన్న టర్నింగు గేటులోంచి చర్చిలోకి ప్రవేశించింది. చర్చికి ముందుగానే మనస్సులోని సకల నాలిన్యాలనూ ఒక్క చూపుతో పోగొట్టే చలువరాతి శిలావిగ్రహం కనిపించగానే యాలిస్ మనస్సు ప్రశాంతతో నిండిపోయింది. చుట్టూ ఉన్న ఎర్రబంతి ఆవరణను దాటి కరుణ చిందించే ఏసుక్రీస్తు దయాస్వరూపాన్ని అయిదునిమిషాలు రెప్ప వాల్చకుండా చూసింది. ఆమె కళ్లలోంచి రెండు కన్నీటి చుక్కలు పాలరాతి విగ్రహం పాదాలపై పడ్డాయి.

'నీ నీడనే పుట్టి పెరిగాను ఏసుప్రభూ! కరుణ కాంతులను వెదజల్లే నీ నిమీలిత నేత్రాలను ఒక్కరోజు చూడకపోతే నా మనస్సు బాధపడిపోయేది ఇంత అర్థస్ఫురితంగా నిన్ను ఏ చిత్రకారుడు సృజించాడో! నీ చలవవల్ల, నీ చల్లని దీవనవల్ల ఈ నెలతోనే అనుకున్న అయిదువందలూ పూర్తయాయి అన్యాయంగా వంచించబడ్డ నాలాంటి దీనులు యికముందు నీముందు దుఃఖించకూడదు. నాలుగు గోడల మధ్య

**అవసరాల రామకృష్ణరావు**

చిన్న గదిలో చెప్పలేని భరించలేని లెక్కలేని రాత్రులు పలకరించే చిన్న ప్రాణి లేక నే నిక గడపలేను.' ఒళ్లంతా పులకరించే తియ్యని ఆలోచనతో ఆమె కళ్ళు తళతళ మెరిశాయి.

'వస్తాడు. తప్పకుండా నా బాబూ నా దగ్గిరికి వస్తాడు 'అమ్మా' అని నన్ను పిలుస్తాడు. ఈసారి నీ దగ్గిరకి నే నొక్కర్తినీ రాను. ఆ పాలమీగడని, ఆ లే దూడని, ఆ తేనె చినుకుని, ఆ పనసతొనని వెంటబెట్టుకుని వస్తాను. ఆ లేత చేతులు నీకూ నమస్కారం చేస్తాయి ఏసు ప్రభూ'

చర్చిలో గంటలు విని యాలిస్ త్రుళ్ళిపడింది.

'అమ్మయ్యో, ఎనిమిదీ! ఆ స్పత్రికి టైమయిపోయింది' రుమాలుతో కన్నీళ్ళు తుడుచుకుని ఏలిస్ త్వరత్వరగా తిరుగుమొహం పెట్టింది.

* * *

ఏడేళ్లు వెనక్కి తిరిగి చూడ గలుగుతే, ఆనాడు యాలిస్ అనాథ శరణాలయంలో నే ఉంది. మరియమ్మ ఎందుకో త్వరత్వరగా వచ్చింది. బంతినారు జల్లుతున్న ఏలిస్ తలెత్తి చూసింది.

'దొరసానమ్మగారు నిన్ను త్వరగా రమ్మంటున్నారే - ముందుగా, రా, కోపంగా ఉన్నారు కూడాను.' కొళాయి దగ్గిర చేతులు కడుక్కొని ఆఫీసు రూంలోకి పరిగెట్టింది. అక్కడ దొరసానమ్మ ప్రక్కని సెక్రటరీ మార్గరెట్ జోన్సూ ఉన్నారు. చుట్టూ తన సహచారిణులు మేరీ, సంతోషం, మేక్ మిల్లన్, రాషెల్ మొదలయిన వారంతా తనవైపే చూస్తున్నారు. యాలిస్ చేతులు కట్టుకు నిలబడింది. జోన్సు మొదలు పెట్టింది.

'మొన్న మీ రిజల్ట్సు వచ్చాయి తెలుసా? నువ్వుతప్ప అందరూ ప్యాసయ్యారు. నువ్వీ జూనియర్ క్లాసులో నే ఏళ్లకొద్దీ ఉండిపోతే మెట్రిక్ ఎప్పుడు ప్యాసవుతావు? - మన క్రిస్టియన్సుకి ముందు ముందు ఎన్ని ప్రోస్పెక్ట్స్ అయినా ఉన్నాయి. మన అనాథ శరణాలయంనుంచి వెళ్లిందే డార్లీ - యిట్టే బియ్యే యూనివర్సిటీ ఫస్టుగా ప్యాసయింది. ఈ ఆర్ఫనేజ్ రూల్సు నీకు తెలుసుగదా! ఇంక థర్డియర్ ఛాన్సు ఉండదు. విలువయిన కాలాన్ని యిలా పాడుచేసుకుంటే - అడుకోడానికి నీకేం తల్లా, తండ్రా?' మార్గరెటు జోన్సు యీమాట అందరికీ ఎప్పుడూ జ్ఞాపకం చేస్తూఉంటుంది. పెద్ద దొరసాని యీ మాటకి ఎప్పుడూ కోప్పడుతూనే ఉంటుంది

'తల్లీ, తండ్రీ ఉంటే యిక్కడి కెందుకొస్తారమ్మా? - చూడు యాలిస్ - నీకన్న చిన్నవాళ్ళు కూడా జూనియర్ స్టేండర్డ్ ప్యాసవుతున్నారు ఎప్పుడూ పూలమొక్కలకి నీళ్లు పోస్తూనో, లేసులు అల్లుతూనో కూర్చుంటే ఎలాగమ్మా? మరేం ఫరవాలేదు చదువు, తప్పకుండా ప్యాసవుతావు - ఇక వెళ్లు' యాలిస్ తన రూంకి వచ్చేసింది బరువయిన మనస్సుతో కుర్చీలో కూలబడింది. గంట గణగణ వాగింది. రూం మేటు సంతోషం ఒక చేతో సబ్బూ, ఒక చేతో మొహం తుడుచుకుంటున్న తువ్వాలుతో అక్కడి కొచ్చింది.

'ఫైవ్ థర్టీ అయింది - ఇప్పుడేం గంటబ్బా, అంది యాలిస్. సంతోషం 'బాబ్ హెయర్' తమాషాగా దువ్వుకొంటూ అంది.

'అదేమిటే? నువ్వు పిక్చరుకి రావూ?

నిన్నే రిజల్ట్సు వచ్చాయిగా! సరదాగా అందరం సినిమాకి వెడుతున్నాం ఇప్పుడు కొట్టింది మీ ల్సాకి గంట. అందరం భోంచెయ్యాలి, వెళ్ళాలి. లే, డ్రెస్ చేసుకో.'

ఆఖరికి దొరసానమ్మే స్వయంగా వచ్చి బ్రతిమాలినా యాలిస్ 'నేను రాను' అనేసింది మూప్పావు గంటలో అర్ఫనేజ్ అంతా ఖాళీ అయిపోయింది దూరంగా ఒక్కరో యిద్దరో వాచ్ మెన్, ఇల్లు క్లీన్ చేస్తున్న పెద్ద వంటమనిషీ తప్ప హోస్టలంతా నిర్మానుష్యమయిపోయింది

గదిలో లైటు వెలిగించుకుని యాలిస్ ఆలోచిస్తూ పడుకుంది

ఆరు నెలలకి ఒక్కసారి ప్రిన్సిపాలు సినిమాకు పంపుతుంది - సినిమాలంటే తన కెంత సరదా అయినా ఈ రోజు తన మనసు మళ్ళించలేక పోయాయి

'ఇంత చిన్న పరీక్షలో తనెందుకు ఫేలయింది? - లెక్కలంటే అంత తలనొప్పిగానూ యింగ్లీషు గ్రామరంటే అంత చికాకుగానూ తన కెందుకుండాలి? టీచరు లెసను చెప్తున్నంతసేపూ తన దృష్టి డాక్టరు గులాబీమీదో, సీతాకోక చిలకమీదో ఎందుకు పోవాలి? ఇలా మరో ఏడు తప్పితే తనేమైపోవాలి? 'అర్ఫనేజిలో ఉన్న పిల్లలకి చప్పన కన్నీళ్ళు రావు. తల్లీ, తండ్రీ, లేనివాళ్లమని వాళ్లకి ముందే తెలుసు అందుకనే మనసు బాధించినా యాలిస్ కి కన్నీరు రాలేదు ఎదిగొచ్చేటప్పటికి పుటుకోకల్లు ఎందుకు ఏడవాలి? అని ప్రతి రోజూ, తనే అలా దుఃఖిస్తే తన వనక చిట్టి చెల్లాయిలు ఏమైపోవాలి? అమ్మెవరో ఎరగని పురిటికందులు ఎంతని దుఃఖించాలి?

యాలిస్ రూం తాళం వేసి యివతలికొచ్చింది గార్డెన్ లోకి వచ్చింది రోడ్డుకి యిరువైపులా వేసిన బొగడ ఒంతిపూలు తన్ని వెక్కిరిస్తున్నాయ్ లేత వెన్నెల, సన్నని మధురమైన స్వరంతో ఆనందాన్ని ప్తోంది ప్రక్కనే విరియబూసిన నైట్ క్వీన్ చక్కని, సున్నితమైన వాసన ఎక్కడెక్కడికో తీసుకుపోతోంది.

'నాకూ, యీ పువ్వులకూ ఏమిటో అనుబంధం?' అనుకుంది యాలిస్. అలా అంతూ దరీ లేని ఆలోచనలతో కాంపౌండ్ వాల్ వరకూ నెమ్మది నెమ్మదిగా వెళ్ళిపోయింది. 'రంయ్'మని అతిస్పీడతో ఒక కారువచ్చి పెద్ద చప్పుడుతో యించుమించు గేటుదగ్గిర ఆగిపోయింది. యాలిస్ దూరంనించి చూసి 'ట్యూబ్ బరస్ట్ అయిందేమో' అనుకుంది అందులోంచి ఒక వ్యక్తి దిగాడు. 'మరో ట్యూబ్ ఉంది కాబట్టి సరిపోయింది- లేకపోతే ఏమౌనో?'

అని అతను గొణుక్కోడం యాలిస్ వినక పోలేదు. కొంతసేపటిలో అతను 'కారు' రైట్ చేసుకున్నాడు.

సన్నని - సన్నజాజి పరిమళం లాంటి- లేత వెన్నెల.

'ఎవరక్కడ?' అంటూ అతను యాలిస్ మీద బ్యాటరీ లైటు వేశాడు. వెంటనే నాలుక కరుచుకొని___

'అయాం సారీ, ఎవరో అనుకున్నాను' అన్నాడు

'ఫరవాలేదు' అంది యాలిస్ తనలో తానే అన్నట్టు.

'ఈ కనపడుతున్న బిల్డింగ్ ఏమిటి?'

'లేడీస్ అర్ఫనేజ్' అంది యాలిస్.

'సిటీ ఇంకా ఎంత దూరం?'

'నాలుగు మైళ్లు ఉంటుంది.'

'ఇక్కడెక్కడేనా మంచినీళ్లు దొరుకుతాయా?'

'నే తెస్తాను, యిక్కడే ఉండండి' యాలిస్ లేడిపిల్లలా లోనికి పరిగెత్తింది. ఈలోగా ఆ యువకుడు వైనాక్యులర్సు తీశాడు యాలిస్ వైపు సారించాడు

'ఎంత అందం! ఏమి సోయగం!' అనుకున్నాడు. యాలిస్ మంచినీళ్ళు తెచ్చి ఇచ్చింది రెండు గుక్కల్లో అతను మరచెంబుడు మంచినీళ్ళూ తాగి, అదోలా ఆమెవైపు చూస్తూ 'నా దాహం తీర్చారు మీ కెలా కృతజ్ఞత తెలపాలో తెలియడంలేదు చల్లని గాలి - చక్కటి వెన్నెల - కారుమీద అలా ఓసారి సిటీలోకి రాడానికి మీకు అభ్యంతరముండదనే నా!' యాలిస్ అతనివైపు తేరిపారి చూసింది

ఉంగరాలు తిరిగిన జుత్తు- సెంకితవంగా, ముత్తెక్కించేటట్లుగా తనవైపే చూస్తున్న ఎఱ్ఱటి కళ్లు - క్రింది పెదవిని నొక్కిపట్టిన పళ్ళు - సిల్కు చొక్కా, ట్వీడు పేంట్, బంగారపు వాచీ, జేబులో చేతులు___ఎవరితను? తనకీ యితనికి ఏం సంబంధం? తన్నెందుకు పిలవాలి?

పురుష సాంగత్యం ఎరగని యాలిస్ కన్నె మనసులో ఏం గిలిగింతలు కలిగాయో తెలియదు. మంత్రముగ్ధలా అతని వెనకే వెళ్ళి కారు వెనకసీటులో కూర్చుంది కారు కదిలింది.

* * *

యాలిస్ పరిగెత్తింది. సముద్ర తరంగాలలో ఉయ్యాల లూగుతున్న చందమామ కన్న త్వరగా పరిగెత్తింది. చల్లని సముద్రపు గాలికి ఆమె ముంగురులూ, దుస్తులూ - వీటితో పాటు దేనికో భయపడుతూ ఆమె మనస్సూ ఊగులాడుతున్నాయి. అతను తొందరగా పరిగెత్తి వచ్చి తన్ని పట్టుకున్నాడు.

"ఇవ్వాళ మీ రెంత అందంగా కనిపిస్తున్నారండీ సుందరమ్మగారూ!"

"నిజంగా అంటున్నారా, పార్వతమ్మగారూ ?"

"ఎబ్బె? నిజంగానే నండీ. ఇంతెందుకూ - మీ అంత వయస్సువచ్చినా యింత చిన్న పిల్లలా కనిపించే మరొక ఆడదాన్ని నేను ఎరగనంటే నమ్మండి!"

'వద్దు - ఇప్పుడొద్దు - నన్ను క్షమించండి- వదలండి' యాలిస్ పెనుగులాడింది. అతడామెను విడిచేశాడు.

'సరిపడే హృదయంకోసం, దేశాలు గాలిస్తున్నాను సామీప్యంలోనే ఉందని తెలుసుకోలేకపోయాను. ఈనాడు నువ్వు దొరికేవు నిన్ను విడిచి క్షణం బ్రతకలేను. తుచ్ఛమైన శరీరసుఖంకోసం నే నెన్నాడూ వాంఛించలేదు. వివాహమయ్యేవరకు నిన్ను తాకనని మాటయిస్తున్నాను.'

యాలిస్ తల ఎత్తి అతనివైపు చూసింది. ఎఱ్ఱని కళ్ళు ఎందుకో బాధపడుతున్నాయ్ ఎత్తైన చాతీ దేనికో క్రుంగిపోతోంది నిర్మలమైన అతని ముఖంలో పాపతలంపు గాని, మోసబుద్ధి గాని యాలిస్ కు నూగనగానైనా కనిపించలేదు. మరు క్షణంలో యాలిస్ అతన్ని దగ్గిరగా తీసుకుంది

'నేను పాపిష్టిదాన్ని. మిమ్మల్ని శంకించాను. క్షమించండి.' అతడామె ముంగురులను సవరించాడు. ఇసకలో చేతికి దొరికిన రాయిని తమాషాగా సముద్రంలో విసిరేడు. కెరటాలూ, చంద్రుడూ మరింత కంపించాయి

* * *

ఇంకా తెల్లవారలేదు. యాలిస్ అడుగుల్లో అడుగులు వేసుకుంటూ అర్ఫనేజ్ ఆవరణలోకి వచ్చింది. ఇన్నాళ్ళూ తనలో మానవత్వం నిద్రించినట్టూ - గడచినరాత్రే మేల్కొని సఫలమైనట్టూ - యాలిస్ లోని ప్రతి నరం పాటలు పాడుతున్నాయి. రాత్రి కురిసిన మంచుబిందువులు ఆమె కాళ్ళను ముద్దెడుతున్నాయ్ ప్రక్కనే వున్న రెండు తెల్లగులాబీల జంట యాలిస్ కు రోజుకన్న అందంగా కనిపించింది. ముళుపు తిరిగి చిన్న కాలిబాటద్వారా చరి



# అమ్మ చాలా మంచిది

చేరుకుంది. ఏసుక్రీస్తు శిలావిగ్రహానికి మన సారా నమస్కరించింది. 'నాకు తెలిసినంతవరకు నా తల్లి, తండ్రి నీవే ఏసు ప్రభూ!—నా స్త్రీజన్మ రహస్యమేమిటో నిన్ననే అర్థమయింది. నీ క్షేమరి చెప్పను ప్రభూ!' యాలిస్ ఎదురుగా ఎవరో మనిషి ఉన్నట్టు సిగ్గుపడింది. తిరిగి తలెత్తి విగ్రహాన్ని చూడలేకపోయింది తిరిగి ఒక్క నమస్కారం పెట్టి అర్ఫనేజ్ చేరుకుంది. ఫ్రెండ్సందరూ ఆమెను మూగిపోయేరు.

'ఎక్కడికెళ్ళేవే యాలిస్?'

'రాత్రి తొమ్మిది దాటితే కాంపౌండు గోడు దాటి ఎరుగుదువే? నీ గురించి జోన్సు చేస్తున్న హడావిడి యింతా అంతా కాదు!'

'అంత అవసరముంటే పెర్మిషన్ తీసుకు వెళ్ళవలసింది!'

ఇంతలో మార్గరెటు జోన్సు అక్కడకొచ్చింది.

'అనాధ శరణాలయమంటే - తల్లీ తండ్రీ లేని చిన్నపిల్లలకు. అంతేకాని వారిని పెద్దచేసి మళ్ళీ పిల్లల్ని కనే వయస్సు దాకా పెంచమని కాదు. ఈ విషయంలో ఈ అర్ఫనేజ్ స్థాపించిన మేడమ్ ఎమిలీ పొరపాటు చేసిందనే నా ఉద్దేశం. ఫ్రీగా ఎడ్యుకేషన్ దీనితో జోడించడమే ఆవిడ చేసిన పెద్ద పొరపాటు. రెక్కలొచ్చిన పక్షులనూ, వయస్సొచ్చిన పిల్లలనూ పట్టడం కష్టమే మరీ!' ఎవరూ ఏం మాట్లాడలేదు.

'పెద్ద దొరసానమ్మ వచ్చి స్వయంగా బ్రతిమాలినా నువ్వు పిక్చర్‌కి రాలేదు. వేరే నీకు ఎంగేజిమెంట్సు ఉన్నాయని మాకు తెలీదు - అది సరే. మిగిలినవారి కేరక్టర్ సరిదిద్దడానికయినా నువ్వీ ప్రశ్నకి జవాబు చెప్పవలసి ఉంటుంది. వయస్సు వచ్చిన నువ్వు - ఒక్కరాత్రి పూర్తిగా వేరే గడిపేవు. ఎక్కడ గడిపేవో సూటిగా, దాచకుండా జరిగిందంతా చెప్పాలి'

యాలిస్ ఏమీ భయపడకపోడం, నిర్భయంగా, నిశ్చలంగా జవాబు చెప్పడం అందరికీ ఆశ్చర్యం కలిగించింది.

'దాచవలసిన విషయమేమీ లేదు - నేను అంతా, స్వయంగా, దొరసానమ్మగారికే నివేదించుకుంటాను. ఆ మాట అనేసి యాలిస్ స్వరత్వరగా రూంలోకి వెళ్ళిపోయింది. తలుపు వేసుకుని, మంచంమీద పడి కాళ్లూ చేతులూ ఆనందంతో కొట్టుకుంది.

* * *

'జరిగినది యిది అమ్మగారూ! నన్ను క్షమించాలి. ఆయన పేరు ప్రసాద్. వైజాగ్‌లో మిల్ ఓనర్ కుమారులు. యం. బి. ఫైనలు యియర్ చదువుతున్నారుట. అన్నీ మంచే కనుక్కున్నాను అమ్మగారూ! ఒకటి రెండు నెలలలో మంచి ముహూర్తం చూసి నన్ను మేరేజ్ చేసుకుంటానని చెప్పేరు. మీ దగ్గిర ఎప్పుడూ ఏమీ దాచలేదు.' యాలిస్ సిగ్గుతో తల దించుకుంది.

దొరసానమ్మ ప్రేమగా ఆమె తల నిమురుతూ అంది.

'నువ్వు తొందరపడి పోయావేమో నన్ను యాలిస్! అర్ఫనేజ్ గేటుదాటి ఎరగవు. నీకు ప్రపంచజ్ఞానం ఎంతుంది? లోకంలో అందరూ మంచివాళ్లే ఉండరమ్మా! ఆడపుట్టుక అల్లకల్లోలమైన సముద్రం. లభించేది చంద్రోదయమో, అమావాశ్య చీకటో మనకి అర్థంకాదు. జీవితంలో మచ్చపడి బ్రతకడం చావు కన్న కనికిష్టం.—చిన్నదానివి. నిన్ను పెద్ద పెద్ద మాటలాడి బెదిరిస్తున్నానేమో! మరోలా అనుకోకు. ఏసు ప్రభువు నిన్ను కరుణిస్తాడు. త్వరలో నీ మేరేజ్ పార్టీకి వస్తాను. విష్ యు గుడ్ లక్!'

ఆనందంతో ఆకాశయానం చేస్తున్న యాలిస్‌కి ఇవన్నీ అర్థంకాలేదు. ఆఖరి ముక్కకి మాత్రం బుగ్గలు ఎఱ్ఱబడి, నోట్లో జేబురుమాలు కుక్కుకుని రూంనుంచి ఇవతలికొచ్చింది. అక్కడ 'సంతోషం' ఎదురైంది.

'నీ దగ్గిర ఎప్పుడూ ఏమీ దాచలేదు సిస్టర్! జరిగినది యిది...' యాలిస్ అంతా చెప్పింది. సంతోషం ఏమీ సంతోషించలేదు.

'అందరి మనసులూ నీ అంత ఉన్నతంగా, నిష్కల్మషంగా ఎందుకుంటాయి యాలిస్? అతని కులం ఏమిటి? మన కులం ఏమిటి?'

యాలిస్ దీనికీ భయపడలేదు. కళ్ళు మరింత అందంగా పెద్దవిచేస్తూ అంది.

'ఆయన మాటలు వింటే నువ్విలా అనుకుంటావా సంతోషం? - 'కులమూ, మతమూ, డబ్బూ, సంఘమూ, బంధువులూ మనల్ని విడదియ్యగలవా యాలిస్? మబ్బులన్నీ ఏకమైనా చంద్రుడి నుంచి కాంతిని

కాలేజీ కుర్రాడొకడు కొత్తగా ప్రేమపిచ్చిలోపడి, కనిపించిన ప్రతి మిత్రుడికీ తన ప్రేయసి అంద చందాలను గురించీ, గుణగణాలనుగురించి తెగచెప్పి చెప్పి, ఆ పిల్ల గనక తనను పెళ్ళిచేసుకోకపోతే తను చచ్చిపోతానన్నాడు.

ఆ పిల్ల అతనిని చేసుకోనన్నది.

ఆమాట అన్న తరువాత సరిగ్గా ఏభై ఏళ్ళకి అతను చచ్చిపోయాడు!

చేరు చెయ్యగలవా?' దీని కేమంటావ్ సిస్టర్?'

'ఉపమానాలు బాగానే ఉన్నాయి. నాకేమో భయంగానే ఉంది. ఏమైనా తొందరపడిపోయావు సిస్టర్!'

సంతోషం కూడా యిలాగే అంటుంది. తను నిజంగా తొందరపడిపోయిందా? అద్దంలో తల దువ్వుకుంటూ మరొకసారి తన్ను తను ప్రశ్నించుకుంది యాలిస్. అద్దాన్ని ముద్దెట్టుకుంది.

రాత్రి అవుతోంది. నైట్ క్వీన్ పరిమళిస్తోంది. చంద్రుడు ఆకాశంమీద కొస్తున్నాడు. కారు హారన్ వినపడింది. యాలిస్ చేతిలో రిబ్బన్ జారిపోయింది.

* * *



# అమ్మ చాలా మంచిది



చిన్న చిన్న గాడ్పులు ప్రారంభించాయి. మల్లెమొక్కలన్నీ చిన్న చిన్న మొగ్గలు వేస్తున్నాయి. పక్షులు తమాషాగా అరుస్తున్నాయి. కారు హారన్ వినిపించింది యాలిస్ త్వరత్వరగా రూంలోనికి పరిగెత్తింది. సరిగ్గా రూం దగ్గర దొరసానమ్మ అడ్డంగా నిల్చుంది

'నీ పద్ధతేం బాగులేదు ఇవాళ ఏదో ఒకటి తేలిపోవాలి నాతోరా'

ఆవిడ కళ్లుచూస్తే యాలిస్‌కి భయం వేసింది. ఆవిడ వెనకగా నడిచింది. దొరసానమ్మ యాలిస్‌ను తన ప్రైవేటు రూంకి తీసికెళ్ళింది.

'వయస్సులో ఉన్నదానివనీ, చిన్నదానివనీ నీ మొదటి తప్పును నేను క్షమించాను. కాని నిన్ను ప్రకృతి క్షమించలేదు. నీకు మూడవమాసమని జోన్సు అనుమానిస్తోంది. నిజమేనా?'

యాలిస్ మాట్లాడలేదు. బొటకన వ్రేలుతో నేలని రాస్తూ ఊరుకుంది.

'నువ్వీ పరిస్థితులలో నీ ఫ్యూచర్ నిర్ణయించుకోకపోతే నిన్ను నువ్వే మోసపుచ్చుకొన్నదానివౌతావు. లోకం రహస్యంగా ఎన్ని తప్పులు చేసినా భరిస్తుంది, కాని బుజువయిన, కళ్లబడిన నేరాన్ని క్షమించదు. ఇదివరకు సౌమ్యమైన నీ ప్రవర్తన బట్టి - యీ మూడు నెలలూ నిన్ను ఉపేక్షించాను. నాలుగు నెలలు యిట్టే గడిచేయి. ఎంత సరిదిద్దుకున్నా, సమర్థించుకున్నా - నువ్వింక యిక్కడ ఉండడానికి రూల్సు ఒప్పుకోవు. నువ్వు యివాళే రూం ఖాళీ చెయ్యవలసి ఉంటుంది' దొరసానమ్మ కాలింగ్ బెల్ నొక్కింది. జోన్సు వచ్చింది. 'నువ్వు యీ విధంగా యిక్కడనుంచి వెళ్లడం మా కందరికీ విచారంగా ఉంది. శత్రువులను సహా క్షమించే ఏసు ప్రభువు నిన్ను కరుణించుగాక!' ఏలిస్ దొరసానమ్మకు నమస్కారం పెట్టింది. కళ్లమ్మట నీళ్లు గిర్రున తిరిగేయి. ఆమె రూం చేరుకుంటూంటే చుట్టూ నవ్వులూ, గుసగుసలూ వెక్కిరించాయి. ఆమె రూం చేరుకుంది. సంతోషం ఆమెను కౌగలించుకుంది.

'నువ్వు చేసింది తప్పుకాదు సిస్టర్! కోర్కెలను బలవంతాన అణుచుకోవడమే వ్యభిచారం. త్వరలో నీనుంచి శుభలేఖ వస్తుందని ఆశిస్తున్నాను.'

యాలిస్ అందరికీ నమస్కారం పెట్టింది. తను పెంచిన మొక్కల్నీ లతల్నీ కష్టంగా, కన్నీళ్ళతో విడిచింది. చాలామంది గేటు దాకా వచ్చారు.

ప్రసాద్ మొహంలో రంగు రంగులు ఆమెను ఆశ్చర్యపరిచాయి.

'ఏమిటీ సామాను? వీళ్లంతా ఎవరు?'

'అంతా చెపుతాను ఎక్కండి' అతను సామానంతా కారులో పెట్టేడు. అందరూ గుడ్ బై చెప్పేరు. కారు కదిలింది

ఎంత ఆపుకుందామన్నా యాలిస్‌కి దుఃఖం ఆగలేదు ప్రసాద్ ఆశ్చర్యపోయాడు. అతడామె కన్నీళ్లను తుడిచాడు.

'ఏమిటది? ఎందుకా ఏడుపు?'

'నేను మొదటినుండీ ఆశ్రయం లేనిదాన్ని. అనాధ శరణాలయంలో పెరిగేను. మీరు నా జీవితంలో ప్రవేశించారు. నన్ను నిరాధారను చేస్తారేమో అనే భయం నిత్యం వెన్నంటుతోంది.' ప్రసాద్ ఆమెను దగ్గరగా తీసుకుని బుజ్జగించాడు.

'నీకా భయం ఎందుకు కలిగింది?'

'మీ రెవరో నాకు తెలీదు. మీ మాటలన్నీ నమ్మేను నా శరీరం, మనస్సు మీకు అర్పించేను. మూడు నెలలు గడిచాయి మీరు నన్ను పెళ్లిచేసుకోలేదు. అది పవిత్రమైన బాలికల్ని పెంచి విద్యాబుద్ధులు చెప్పించే సంస్థ. నాలాంటి గర్భిణికి..'

ప్రసాద్ మొహం క్షణంసేపు రక్తవిహీనమైంది. యాలిస్ రెండు చేతులలో అతని బుగ్గల్ని నవరిస్తూ అంది.

'దీనికి మీరు చింతించ నక్కర్లేదు.— మీరు నన్ను మోదాన్ని చేసుకుంటే నా కెవరి నిందలూ బాధించవు నాలో పెరిగిన మీ రూపం నన్నేమాత్రమూ బాధించలేదు. ఇవాళ మీయింటికి నన్ను తీసుకెళ్లకపోతే ఒప్పుకోను. మూడు నెలలు - నే నెంత బాధపడ్డానో మీకు తెలియదు. - ఇంక నే నూరుకునేది లేదు. మనకి ముహూర్తాలక్కర్లేదు. రిజిష్టరీ మ్యారేజ్ చేసుకుందాం' యాలిస్ అతని కళ్లలోకి చూస్తూ అంది. అతని కళ్ళు యాలిస్ భావాల్ని సమాధానపరిచేవిగా లేవు. కారు ఆగింది.

'దీనికి ఆపు చేశారు?'

'నువ్వు యిన్నాళ్ళూ ఒకచోట ఉన్నావని ధైర్యంగా ఉండేది. వాళ్ళంత త్వరగా నిన్ను పంపించేస్తారనుకోలేదు.'

యాలిస్‌కి అర్థమవలేదు.

'నా కేమిటో భయంగా ఉంది. ఏమిటి మీ భావం, చెప్పండి!'

'మనం చిన్నవాళ్లం. పెద్దవాళ్ళ భావాలు మన భావాలవలెనే ఉండవు.'

'ఇప్పు డదే మొచ్చింది?'

'నిన్నీ పరిస్థితులలో మా యింటికి తీసుకెళ్ళడానికి కుదరదు. ఎక్కడికి తీసుకెళ్ళనా అని ఆలోచిస్తున్నాను.'

యాలిస్ గుండె తీవ్రంగా కొట్టుకుంది. ఆమె మొహం ఎర్రబడింది. పెదవులు వణికేయి.

'ఏమిటి మీ ఉద్దేశం? నన్నేం చేదామని? ముందే అన్ని సంగతులూ చెప్పకుండా నన్నెందుకు మోసపుచ్చేరు?'

'నిన్ను మోసంచేద్దామని నా కెన్నడూ లేదు యాలిస్! ఇప్పటికేనా నా అందాలగాలిని - నానుంచి ఎవ్వరూ వేరు చెయ్యలేరు!' యాలిస్ కంటికొలుకుల్లో నీటిని అతను తుడిచాడు. యాలిస్‌కి ధైర్యమొచ్చింది.

'మరెందుకలా అంటారు? మనయింటికి పోదాం పదండి'

'అదే ఎలాగో యిన్నాళ్లూ ఆలోచిస్తున్నాను. మా అమ్మ, నాన్నగారూ నవీన భావాలు కలవారే గాని మా మేనత్త చండశాసనురాలు. లోకం పోకడ నీకు తెలీదు యాలిస్ నువ్వు క్రిష్టియన్‌వి. తల్లీ తండ్రీ లేని అనాధవి. అనాధ శరణాలయంలో నుంచి వచ్చినదానివి. వీటన్నిటినీ మించి గర్భిణివి. ఇలాంటి విషయాలు మన మనస్సులకు దూదిపింజెలు. కాని లోకానికి, పెద్దలకూ పర్వతాలలాంటి అభ్యంతరాలు. చిన్నవాళ్లు పెద్ద శక్తులను ఎదుర్కొని సుఖపడడం సులువుకాదు యాలిస్!'

యాలిస్ ముంగురలను సవరిస్తూ అతను అన్నాడు.

'అయితే మీ ఉద్దేశం?'

'వీటన్నిటినీ కాదని - ప్రస్తుతం మా తమ్ముడికి జ్వరంగా ఉంది. ఈ పరిస్థితులలో మావాళ్ళకు నిన్ను పరిచయం చెయ్యడం సుఖాంతం కాని విషయం. నామీద అభిమానమంతా పోగుచేసుకుని, నన్ను క్షమించి ఒక్క ఆరు నెలలు నువ్వు ఓపికపట్టాలి యాలిస్!'

'ఆరు నెలలే?' అనబోయింది యాలిస్. అందమైన, బలమైన ప్రసాద్ బాహువులు ఆమెను ఏమీ అడగనియ్యలేదు. అతడామెను దగ్గరగా తీసుకున్నాడు.

* * *

కాలానికి దేనితోనూ సంబంధం లేదు. మరి మూడు నెలలు గడిచాయి. కారుహారన్ వినిపించింది. యాలిస్ గది తలుపు తెరిచింది. ప్రసాద్ లోపలికొచ్చాడు. గదంతా కలయజూశాడు.

'రూం ఎంత నీటుగా సర్దుకున్నావ్ యాలిస్? నిన్ను మా యింటికి తీసుకెళ్లే అదృష్టం నాకింకా కలుగలేదు. నిన్ను యీ అద్దె యింట్లో ఉంచవలసివచ్చిందని నేను కుమిలిపోని క్షణం లేదు'

యాలిస్ ఫ్లాస్కులో కాఫీ గ్లాసులో పోసియిచ్చింది.

'కేరియరు సరిగ్గా వేళకు తెస్తున్నాడా' తల ఊపింది యాలిస్.

'ఈ ప్రేమికుడు బీదవాడైతే నువ్వు చెప్పలేని బాధలు పడిఉందువు. కాని నిన్నే విధంగానూ శ్రమపెట్టే అవసరం రాలేదు నాకు. మా నాన్నకి నీ ధర్మమా అని మూడు మిల్లులున్నాయి నే ఒస్తాను మరి కాలేజీకి టైమైంది'

ప్రసాద్ బూట్లు చప్పుడుచేసుకుంటూ వెళ్ళిపోయాడు.

ఇలాగే యితను కొన్నాళ్లు ప్రతిరోజూ, అప్పుడప్పుడు వారానికో రోజూ వచ్చి ఏం కావాలో కనుక్కొని వెళ్ళిపోతుంటాడు

'అమ్మగారూ, కేరియరు పడేస్తారా?' దాసీది కేకేసింది. యాలిస్ చూసింది తనింకా తిననేలేదు. అది నిండుగానే వుంది. రెండు పూటలా తినడం, పడుకోడం - యిదేనా జీవితం? ప్రసాద్ తన్ని నిజంగానే ప్రేమిస్తున్నాడా? లేక అబద్ధాలు చెప్పి మోసబుచ్చుతున్నాడా? నిజంగా మోసబుచ్చదల్చుకుంటే తన్ని అర్ఫనేజ్ బహిష్కరించిననాడే నడివీధిలో వదిలెయ్యవచ్చును తనకి వేరే యిల్లు చూసి సదుపాయాలు చూడడం దేనికి?

'నేను మోసపోయినా?' అని ప్రశ్నించుకుంటూ యాలిస్ రోజులు కష్టంగా గడిపింది 'ఇప్పుడేనా ప్రసాద్ నాలుగు రోజులు వరుసగా రాకపోతే మనస్సు శంకిస్తుంది నేను అగాధంలో పడిపోయానా?' ఈ ప్రశ్నలతోనే యాలిస్ దినాలు గడిపింది. గడియారం తిరిగింది కేలండరు చిరిగింది కొత్తసంవత్సరం వచ్చింది యాలిస్‌కి పురిటిరోజులు దగ్గరపడ్డాయి పదిహేను రోజులైె ప్రసాద్ రాలేదు అనాళ్ళ ఆమెకు ఏదో చెప్పలేని బాధగా ఉంది.

'కొత్తవాళ్లనూ, డబ్బున్నవాళ్లనూ, మగవాళ్లనూ నమ్మకూడదన్న ఖ్యార్యనూ నిజమేనా?...... నా బ్రతుకు చీకటేనా?' అనుకుంది యాలిస్

'నాకు పుట్టబోయే అందాలపాప నాకు చాలు. వాడి చిరునవ్వే అనాధ అయిన నాకు పదివేలు నాకెవరూ అక్కర్లేదు!' అనుకుంది ఇంతలో కారు వచ్చి ఆగింది ప్రసాద్ రాలేదు నర్సు దిగింది

'ప్రసాద్ గారు మిమ్మల్ని ఆసుపత్రికి చేర్చమన్నారు. మీకేం తల్లా తండ్రా? అక్కడే పురుడు పోసుకుందురు గాని.' యాలిస్ బయల్దేరింది.

*　　　*　　　*

ఆ తరువాత ఏమైంది?

తలుచుకోడానికి యాలిస్ మనస్సు నిరాకరించింది. అంతవరకు తన జీవితం పువ్వుల బాట తరువాత?

ఆస్పత్రిలో చేరేక, తనకి తెలివి తప్పిపోయాక - ఎప్పటికో తెలివి వచ్చింది యాలిస్‌కి. శరీరం, మనస్సు చాలా తేలిక అయిపోయినట్టనిపించింది చాలా నీర్సంగా ఉంది. క్రితంరోజు తన్ని కారు ఎక్కించిన నర్సే గ్లాసుడు ఓవల్టిన్ తెచ్చి యిచ్చింది. అది త్రాగేక యాలిస్‌కి కొంచం బలం వచ్చింది.

'ఏదమ్మా? ఎక్కడ నా పిల్ల? నా పాపాయి ఏదీ?' వణికే చేతులతో యాలిస్ పక్కంతా వెతికింది చుట్టూ చూసింది

'నీ పురుడు చాలా కష్టమయిపోయిందమ్మా! మత్తుమందు యియ్యవలసి వచ్చింది. అసలు నీ ప్రాణం దక్కడమే బ్రహ్మాండమయిపోయింది'

జీవితంలో తనకున్న ఒక్క ఆశనూ కూడా ఏసు ప్రభువు తెంపేశాడా? ఇన్నాళ్ళూ తనలో పెరిగిన జ్యోతి తన కళ్లు పడకుండానే ఆరిపోయిందా?

'అమ్మా! నాకు పుట్టినది ఆడపిల్లా, మొగపిల్లా? ఒళ్ళుగా ఉండేదా? అందంగా ఉండేదా? నాకు చూపించకుండా ఎందుకు పారేశారు?'

నర్సు కొప్పడింది.

'ఈ ప్రశ్నలవల్ల లాభమేమిటమ్మా? పోయినపిల్ల ఎలా ఉంటేనేం? రాత్రి అనగా పోయింది. ఇప్పటివరకు ఉంచాలని మాకు తెలీదు.'

'ఆయన వచ్చారా? పాపను చూసుకున్నారా?'

'మాకు తెలీదు. ఆయన ముందుగానే అంత సొమ్మూ ఆస్పత్రికి చెల్లించేశారు. మళ్ళీ వచ్చినట్టులేదు' నర్సు మరో కేసుకు వెళ్ళిపోయింది.

యాలిస్‌కి చెప్పలేనంత దుఃఖం వచ్చింది పుట్టిన దగ్గరనుంచీ రక్త సంబంధం ఎలాంటిదో ఆమెకు తెలీదు ఆ జీవితనాటకంలో ఒక సూత్రధారి ప్రవేశించాడు. అతను ఆడేది జీవితమో, నాటకమో యింకా ఆమెకు అర్థం కాలేదు. సంఘదూషణకూ, లోక బహిష్కారానికీ తలవంచి ఆమె తన ఆశలన్నీ పుట్టబోయే శిశువుమీదే పెట్టుకుంది. నోటిదగ్గరకు వచ్చిన పానీయం రుచి చూడకుండా నేలపాలయింది. ఏలిస్ బ్రతుక్కి విడుపుకాక మిగిలిందేమిటి?

తరువాత మూడురోజులు యాలిస్ ఆసుపత్రిలో ఎంత కష్టంగా గడిపిందో చెప్పలేము. నాల్గవరోజు నర్సు తన దగ్గరకు వచ్చింది ఈ మూడు రోజులూ తను ఎంత



## అమ్మ చాలా మంచిది



చూసినా ప్రసాద్ మాత్రం రాలేదు నర్సు రాగానే.

'ఈ దంతపు పెట్టె ప్రసాద్ గారు మీ కిమ్మన్నారు. ఇక మీరు ఆస్పత్రి విడిచి పెట్టి వెళ్లవచ్చు' ఆ దంతపు భరిణ ఒకప్పుడు యాలిస్ సరదాగా ఆయన్ని అడిగింది, ఇవ్వలేదు. ఆమె ఎంతో ఆతృతతో దాన్ని అందుకుంది.












చెట్టుతోనున్న డబ్బాకై చూడండి

'ఇది నీ కెప్పుడిచ్చారు? ఆయన ఎక్కడున్నారు?'

'ఆయన గురించి ఏ ఫోటోగ్రాఫులూ నాకు తెలియవు. ఆయన ఎడ్రసు అసలు తెలియదు. ఈ గొలుసుమాత్రం మీ కిమ్మన్నారు.'

యాలిస్ ఆస్పత్రి ఆవరణదాటి యువతిల కొన్నింది. విశాల విశ్వంలో అడుగు పెట్టింది. గంతఫు ఫరిణ విప్పి గోపింది - చిన్న ఈ ఉత్తరం.

'డియర్ యాలిస్! ప్రేమకోసం తల్లిదండ్రుల్ని, సంఘాన్నీ కాదనే శక్తి నాలో లేదు. నేను నిన్ను పెళ్ళి చేసుకోడం లోకసమ్మతంకాని విషయం. అలా చేసే స్తోమత నాకు లేదు. మన మధ్య యిప్పుడు ఏ బంధనాలు కూడా లేవు. నన్ను మరచిపో. ఇంకో యిరవై ఏళ్ళయినా లేని అవకాశం. ఇంకెవరి నేనా పెళ్ళాడి సుఖించు. ఈ విషయాలు ఎదురుగుండా చెప్పలేకపోయాను. క్షమించు ప్రసాద్'

కళ్ళు తిరుగుతున్నాయేమో అనిపించి యాలిస్ తల పట్టుకుని ఒక చెట్టుక్రింద కూలబడింది.

'ఎంత క్రూరం! ఎంత మోసం! ఎంత దగా!' యాలిస్ పళ్లు పటపట కొరికింది. ఆ క్షణంలో ఆమెకు ప్రసాద్ మీద ప్రేమంతా ద్వేషంగా కోపంగా మారిపోయింది.

ఈ గుండెగ్రాగుడు, అన్నంపున్నెం ఎరగని తన్ని మోసంచేసిన యితను - ఇలా సుఖపడవలసిందేనా? మరో పిల్లని పెళ్లాడి హాయిగా ఉండవలసిందేనా? అతను రాసినట్టు వారిద్దరి మధ్యా ఏ బంధనమూ లేదా? తొమ్మిది నెలలు పెనవేసుకున్న మనస్సులు —ఒక్క ఈ ఉత్తరంతో వేరైపోతాయా?

యాలిస్ తన అసహాయస్థితికి వెక్కి వెక్కి ఏడ్చింది.

తన్ని ప్రకృతి ఎందుకు యిబ్బంది పెట్టాలి? ఏసుప్రభువు యింత నిర్దయుడై తననీ, తన పిల్లనీ ఎందుకు వేరుచేయాలి? ఏవిధంగానైనా ప్రసాద్ పై పగ తీర్చుకుంటే తనకు మిగిలే దేమిటి?

నిజంగా తన పిల్ల పోయిందా? పుట్టి బుద్ధెరిగిన తరువాత తను ఒక నాడూ జ్వరంతోనైనా బాధపడి ఎరగదే, తన పురుడు కష్ట మెందుకయింది? తనకు మత్తుమందెందుకు యివ్వాలి? తన పిల్ల శవానైన్నా తనకు కనిపించకుండా ఎందుకు చెయ్యాలి? తన్నీ, తనపిల్లనీ ఎవరు వేరు చేశారు?

ఏమితోచిందో యాలిస్ పరుగు పరుగున ఆస్పత్రివైపు పరుగెత్తింది. అదృష్టం కొద్దీ నర్సు ఆస్పత్రి గేటుదగ్గిరే కనుపించింది. యాలిస్ ఆమె రెండుచేతులూ పట్టుకుంది.

'నిజం చెప్పు నర్సమ్మా? నిజంగానే నా పాప పోయిందా?'

'ఎన్నిసార్లు చెప్పాలి? మీ పిల్లను మేమేం తీసి దాచేశామనుకున్నావా? తెలియని ఏ వెధవకో శరీరాన్ని అర్పించి - పిల్లాడిని కని - వాడితో ఈ సంఘంలో హాయిగా బ్రతుకుదా మనుకున్నావా? ఈ పరిస్థితుల్లో పుట్టిన శిశువు పోవడమే నీ కెంతో మేలు కాదా?'

యాలిస్ అభిమానం దెబ్బతింది. ఆమె కష్టంగా కన్నీళ్ళు ఆపుకుంది.

'ఆడపుట్టుక పుట్టి యీమాత్రం జాలి లేదమ్మా! నేను చేసినది ఘోర పాపమే. ఒప్పుకున్నాను. కాని నా ప్రాణంలో ప్రాణం నా పాపని వేరుచేసుకోగల నమ్మా! నర్సమ్మా, నాకథ నువ్వు ఎరగవు. ఆప్తులంటే ఎలా ఉంటారో, నిష్కల్మషంగా ప్రేమించే హృదయం ఎలా ఉంటుందో తెలియని అభాగ్యురాలు యిది. కష్టనిష్ఠురాలకూ భయపెట్టే మనస్సు నీడలకూ ఓర్చి తొమ్మిది నెలలు దేనికోసం భరించాను? నా పాపను చూడాలని, పాలివ్వాలని - నా హృదయం కొట్టుకుంటోంది. చెప్పమ్మా. నా ఒంట్లో ఏం అనారోగ్యంగా ఉందని మత్తు మందిచ్చారు? నాపాప నేంచేశారు?'

నర్సు మాటాడలేదు. యాలిస్ మెడలో ఉన్న గొలుసువైపు చూస్తోంది.

'ఈ గొలుసు కావలిస్తే తీసుకో - నిజం చెప్పు. నా పాప ఏమైంది?'

మానవత్వానికి లొంగని నర్సు ధనం ముందు దాసోహ మంది.

'అయితే విను. నేను చెప్పినట్టు ఎక్కడైనా చెప్పావంటే నాకే ముప్పువస్తుంది. నీకు చక్కని మొగపిల్లవాడు పుట్టేడు. ఆ ప్రసాద్ గారే వచ్చి పిల్లవాడ్ని తీసుకున్నారు. ఆ సుపత్రి స్టాఫు నోరు మూయించడానికి ఆయన వెయ్యిరూపాయిలు ఖర్చుపెట్టేరు.'

'నిజంగానా? నిజంగా నాకు చక్కని పాపపుట్టేడా?'

'నీకు - ప్రపంచంలో నీలాంటి ఊరూ, పేరూ, దిక్కూ మొక్కూ లేని వాళ్లకి పిల్లలు పుట్టినా లేనట్టే లెక్క. నీకు పాపాయి పుట్టిపోయినట్టు అప్పుడే ఆసుపత్రిలో రికార్డయిపోయింది.'

'అయితే తల్లికీ పిల్లకీ సంబంధం లేదా?'

'లేదు. నీలాంటి దిక్కులేని వాళ్ళ 'పురు'లు ఏ పిసుక్కీనా ఆలించదు మీలాంటి వాళ్లు బ్రతకడమే తప్పు. పైగా సుఖజీవనాలకోసం ఆశించడమే పొరపాటు. ఆయన ఎడ్రస్ అయినా తెలియకుండా ఆయన ఊరూ పేరూ తెలుసుకోకుండా

డాక్టర్ భార్య: నేను పాడుతున్నపుడల్లా మీరు బయటకు వెళ్లి నించుంటారు దేనికి?

డాక్టర్: లోపల వున్నది రోగులు కాదని ప్రజలకు తెలియడానికి.

——వెలూరి రామారావు, (బందరు)

ఆయనతో నువ్వు సంసారం సాగించావు. ఎవరిది తప్పు?'

'ఆయన తండ్రి ఈ ఊళ్ళో మిల్ ఓనరని చెప్పేరు. పైగా మెడికల్ కాలేజీలో యం బి ఫైనలు యియర్ చదువుతున్నార్ట!'

'ఈ మాటలు నువ్వెలా నమ్మేవు? ఆయనిది ఈ ఊరే కాదు. బెజవాడలో ఒక బిస్కేట్ఫేక్టరీ మేనేజరని విన్నాను'

యాలిస్ మనస్సు ఆశ్చర్య క్రోధాలతో జ్వలించిపోయింది.

'న్యాయం కోసం ప్రయత్నించకు. అన్యాయంగా జీవించటం అలవాటు చేసుకో' నర్సు గబగబా నడిచి వెళ్ళిపోయింది.

* * *

యాలిస్ చెప్పిన కథంతా ఆ యువకీలు ప్లీడరు విన్నాడు.

'చూడమ్మా. నీ గాధ అంతా చాలా విషాదపూరితంగా ఉంది. నేనే గనుక రచయితనైతే ఈపాటికి నీకథ చక్కని నవలగా రూపొంది ఉండేది కాని నేను క్రొత్తగా ప్రాక్టీసు పెట్టిన ప్లీడర్ని. నాకూ అనేక సంస్కరణా భావాలున్నా తగిన సొమ్ము లేక ఆచరణలో పెట్టడానికి వీల్లేకపోయింది. న్యాయం సంపాదించాలన్నా ఈ రోజుల్లో డబ్బొకటి కావలసిందే. నీకు పుట్టినబిడ్డ పోయినట్టు రికార్డయిందని నువ్వే చెబుతున్నావు. ఈ కేసు చాలా కష్టతరం. గెలుస్తుందని గ్యారంటీ లేదు. అనుభవం ఉన్నవాళ్ళు నిన్ను వేలతో గాని వదలరు. నాలుగొందలేనా తెచ్చి యివ్వక పోతే నీబిడ్డ నీకు దక్కడు.'

'ఆలోచించు - ఏ నా హా మాతరుండా బిడ్డను కన్నావనే మచ్చ నీమీద ఉండనే ఉంది. నిన్నాదుకునే బంధువు లెవరూ లేనే లేరంటున్నావ్..'

యాలిస్ ఇంక వినలేదు. ఇవతలి కొచ్చేసింది.

నాలుగు వందల రూపాయలు! నిజాన్ని

"నిన్ను పెళ్లాడనని అంటే నిజంగా ఆత్మహత్య చేసుకొంటావా, బావా?" అని అడిగింది అమాయకురాలైన మరదలు.

"సామాన్యంగా అంతే చేస్తానంటుంటాను మరి!" అన్నాడు బావ.

నిజంగా నిరూపించుకోడానికి నిర్భాగ్యురాలు చేయవలసిన ఖర్చు! ఎక్కడ్నించి ఎలా వస్తుంది? ముందు తను జీవించడానికి లోకంలో నలుగురిమధ్య నిలబడ్డానికీ ఎక్కడిది డబ్బు? తన ప్రాణంలో ప్రాణం, తన మానంలో భాగం, తన జీవితగానంలో రాగం తన చిన్నారిపాప తనకు ఏవిధంగానైనా దక్కే మార్గమే లేదా? న్యాయం నశించవలసిందేనా? తన్ని నిలువునా దహించిన నిర్భాగ్యురాలు నవ్వుతూ బ్రతకవలసిందేనా?

లేదు, లేదు. తన చిన్నారి చేతులు తన్ని పెనవేసుకోవలసిందే ఎవ్వరూ ఆపలేరు తన మాతృతృష్ణ ఎవ్వరూ కాదనలేరు. కాని ఎలా? ఏవిధంగా?

అతిదగ్గిరగా చెవులు బ్రద్దలయ్యేటట్టు కారు హారన్ వినిపించింది. ఆమె నరాలు తెగిపోయాయా అనిపించింది. లోకమంతా గిర్రున తిరుగుతున్నట్టు, హోరున అరుస్తున్నట్టు అనిపించి యాలిస్ స్పృహ తప్పి పడిపోయింది.

* * *

యాలిస్ తెలివి వచ్చేసరికి ఆమె ఒక దయామయి ఒడిలో ఉంది. అతి నీరసంగా ఉంది.

'ఎవరు మీరు? నే ఎక్కడ ఉన్నాను?' ఆమె మాట్లాడవద్దని సౌంజ్ఞ చేసి గ్లాసుడు వేడి వేడి పాలు యిచ్చింది.

'అయిదు నిమిషాల్లో నీకు ప్రాణగండమే జరిగేది. మా డ్రైవరు అతి జాగ్రత్తగా సడెన్ బ్రేకు వెయ్యబట్టి మళ్ళీ నన్ను చూడగలిగేవు ఎవరమ్మా నువ్వు?'

నిష్కల్మషమయిన ఆదరణ అంటే ఏమిటో ఎరగని యాలిస్‌కి యీ సౌమ్య వచనాలు నీలిమబ్బులకి చల్లగాలి స్పర్శ తెప్పించాయి. కన్నీళ్లలో ఆమె చెంపలు తడిశాయి.

'నా పేరు మిసెస్ జార్జి. అందరూ 'మిస్సమ్మ' అంటారు. క్రైస్తవ మత ప్రచారకురాల్ని. నీకు అభ్యంతరం లేకపోతే స్వస్థత చేకూరేవరకూ నా దగ్గిర ఉండొచ్చు.' యాలిస్ ఏమీ మాట్లాడలేదు. వివిధాలోచనలు ఆమెను దహించివేశాయి.

'నే నెందుకు బ్రతికాను? ఇంకా యీ జీవితంలో ఏం మిగిలిందని!'

మిస్సమ్మకు మాత్రం ఆమె ఎందుకో రెండు చేతులూ ఎత్తి నమస్కరించింది.

'నా పేరు యాలిస్. నన్ను రక్షించిన మీరు తప్ప నాకీ లోకంలో నువరూ లేరు నామీద మీకేమాత్రం దయ ఉన్నా యింకేమీ నన్ను అడగొద్దు.'

మిస్సమ్మ గోడనున్న చనిపోయిన కూతురు ఫోటోవంక చూసింది.

'నా, రోజ్! మొక్క ఎదిగి, మొగ్గలు తొడిగి, పువ్వులు పూసే వసంతకాలంలో నువ్వు యీ ముసిలి తల్లిని నిర్దాక్షిణ్యంగా వదిలిపెట్టి వెళ్ళిపోయావు. నా దుఃఖాన్ని మరిచిపోడానికి ఏసుప్రభువు మరొకర్ని పంపించాడా' అనుకుంది.

* * *

యాలిస్ నాటికీ నేటికీ తన దీనగాథ మిస్సమ్మకు చెప్పలేదు. దానికి కారణం ఉంది. తను జీవితంలో ఓడిపోయింది. సంఘంలో ఓడిపోయినవాళ్ళూ పరీక్షలో ఫేలయినవాళ్ళూ లోకం దృష్టిలో సానుభూతికి అనర్హులు. మిస్సమ్మ అలాంటిదని కాదు. తను గెలవాలి తనకున్న న్యాయాన్ని పూర్తిగా అనుభవించాలి అప్పుడు అంతా మిస్సమ్మకు చెప్పాలి. మొదట రెండురోజులు ఉందామని చేరిన యాలిస్ మిస్సమ్మను విడిచిపెట్టలేకపోయింది మిస్సమ్మ తనకు తెలిసిన మిస్ట్రెస్‌కి రాసి యాలిస్‌ను నర్సు పరీక్షకు కట్టించింది

'నాకు ఏనాడూ యీ పరీక్ష పుస్తకాలంటే తలనొప్పి కాని నాకు నువ్వు కావాలి. నువ్వు కావాలంటే సొమ్ము కావాలి సొమ్ము కావాలంటే ఉద్యోగం చెయ్యాలి. ఉద్యోగం చెయ్యాలంటే పరీక్షలు ప్యాసవాలి. నిన్ను సాధించి తెచ్చుకుంటాను నా చిట్టి తండ్రీ!'

పరీక్షా ఫలితాలు తెలిసిన రెండు నెలలకి నర్సుపనిలో చేరింది. ఎలవెన్సుతో కలిపి ఎనభై యిస్తారు అందులో పదిరూపాయిలు తను ఉంటున్న రూంకి అద్దెగా మిస్సమ్మతో దెబ్బలాడి యిచ్చేది

'నే నెంత బుగలేనిదాన్ని! ఈ కొత్త లాంతరు ఎందుకు కొన్నాను? ఇది కొనకపోతే నాలుగు రూపాయిలు మిగిలేవిగా'! అనుకునేది. ఆనాడు ప్రసాద్ ఉత్తరంతో తనకు పంపిన దంతపు భరిణచూసి పళ్లు పటపట కొరికేది. 'నీకూ నాకూ ఏసంబంధమూ ఇప్పుడు లేదని ఆనాడు ఉత్తరం పంపేవు. ఆసంబంధమేదో త్వరలో తెలియబరుస్తాను. ఈ దంతపు భరిణలోనే నీ వినాశముందని తెలుసుకో' ఆమె అందులో పెట్టిన సొమ్ము ప్రతిరోజూ లెఖ్ఖపెట్టేది. నెలకి యిరవై రూపాయిలు కూడబెట్టడం బ్రహ్మాండమయిపోయేది. ఒక్కొక్కసారి అందులోంచి సొమ్ము తియ్యవలసివచ్చేది

'బాబూ, ఈ దుర్మార్గురాల్ని నువ్వు క్షమిస్తావో లేదో నీ సొమ్ము తీసుకుంటున్నాను' అని కదిలే కళ్ళతో వణికే వేళ్లతో సొమ్ము తీసుకునేది జీవితంలో మంచి చెడలు యిరవై ఏళ్ళలోనే పూర్తిగా వంటబట్టిన యాలిస్ కు—వణుకుతున్న చలిలో, కొవ్వొత్తి దీపపు వెలుగులో, రాతిగోడల గదిలో అర్ధరాత్రులు అకస్మాత్తుగా మెలకువ వచ్చేది. మిస్సమ్మవలె ఆమె గంటల కొద్దీ బైబిలు ముందు కూర్చోలేకపోయేది. నడివయస్సు తన యౌవ్వనం, సాఫల్యం కాని తన జీవితం, పలకరించే ప్రాణి లేని అయోమయ కాళరాత్రులు! ఆ యువ్వనికి నిద్రపట్టేది కాదు కాని ఈ కటికచీకటి నిశిరాత్రిలో వెలుగుచూపే చుక్కలు, ఈ మాలిన్య గంభీర సముద్రపు అట్టడుగున మిలమిల మెరిసే మంచి ముత్యాలు, ఈ కారుమబ్బుల్లో మెరుపుతీగెలు ఆమె సకల దుఃఖాన్నీ పోగొట్టేవి.

'కాదు, కాదు నా ఊహలు గాలి మేడలు కావు నావి పిచికగూళ్లూ, పేకమేడలూ కానే కావు. ఏసుప్రభువు నాకు అన్యాయం చెయ్యడు నా బాబుని నేను తెచ్చుకుంటాను. ఎవరూ అడ్డుపెట్టలేరు. వచ్చి నా చిట్టినాన్న ఏం చేస్తాడు?'

'అమ్మ అని పిలుస్తాడు. ఒక్క పిలుపుతో, ఒక్క మాటతో నా దుఃఖాన్ని పటాపంచలు చేస్తాడు'

'అవును ఆరోజు తప్పకుండా వస్తుంది. ఇంతకన్న పెద్ద ఉద్యోగం చేసి యింతకన్న ఎక్కువ మిగిల్చి నిన్ను పెద్దచదువు చదివిస్తాను. లోకమంతా గర్వించే వ్యక్తిగా తయారుచేస్తాను. 'ఎవరీ అబ్బాయి?' అని అందరూ అడుగుతారు' ఆ మాట ముఖమంతా దరహాస చంద్రికలు విరిసేవి. ఆమెకు వంటనే నిద్రపట్టేది

చక్కని కలలు విడిపోయాక ఆమె లేచేది ఎప్పుడే అనుమానాలు బాధించినా

మొక్కలను పెంచడంలోనూ, రోగుల సేవలోనూ వాటిని మరిచేది.

*   *   *

ఏడేళ్ళు ముందుకి తిరిగిచూడగలుగు యీనాడు యాలిస్ మిస్సమ్మ యిచ్చిన గదిలోనే ఉంది. ఆమె పెదవులు నిశ్చయాన్ని, ఆమె కళ్లు పగ తీర్చుకోడాన్ని సూచిస్తున్నాయి. ఎక్కడికో ప్రయాణమౌతోంది.

'ఎందుకమ్మా శెలవు పెట్టేవుట?' అంటూ మిస్సమ్మ చర్చినుంచి రాగానే

'ఒకసారి బెజవాడ వెళ్ళిరావాలి' అంది అదోలా యాలిస్.

'ఎందుకూ?'

'మా సీనియర్ నర్సు సిస్టర్‌కి మ్యారేజ్. ఒక్క రోజు లీవు పెట్టేను.'

రైలులో యాలిస్ అనుకుంది.

'బాబూ, నిన్ను చూడాలని నీ కన్నతల్లి వస్తోంది. నీకోసం ఓ జీవి యిలా పంచప్రాణాలూ పెట్టుకుని బ్రతుకుతోందని నీ పసిహృదయానికి తెలీదు. నిన్ను పెంచి పోషించే అదృష్టం ఏ పుణ్యాత్ముగాలికి కలిగిందో! ఆరేళ్లకి నువ్వు ఎలా మారిపోయావో! నా కథ వింటే నువ్వు నన్ను ఆదరించగలవా నాయనా?'

ఎంతసేపో ప్రయాణం చేసినట్టయింది. ఆఖరికి బెజవాడ వచ్చింది. నర్సు చెప్పిన యిన్ఫర్మేషనుతో కొంచెం కష్టపడి యిల్లు కనుక్కొంది. ఒక అరఫర్లాంగు దూరంలో రిక్షా ఆపించి పంపేసింది.

అది ఒక బంగళా. అందులోంచి రివ్వుని ఓ కారు యవతలి కొచ్చింది. ఆహారన్ విని యాలిస్ గుండెలు దడదడ కొట్టుకున్నాయి

'సందేహంలేదు. నన్ను సర్వనాశనం చేసిన దుష్టుడిదే యీ యిలు. ఆతడే యితడు. క్రింది పెదవి నొక్కి పెట్టిన పళ్లు, ఎవరినేనా వశం చేసుకోగల ఎఱ్ఱనికళ్ళు, జేబుల్లో చేతులు - ఆనాడు ఆర్ఫనేజ్‌లో చూసినట్టే ఉంది. ఈ నిర్మల బాహ్యరూప నదీజలంలో యింత లోతైన సుడిగుండముందని ఎవరనుకుంటారు?' అనుకుంది.

'ఇతన్ని యిలా నిలదీస్తే లాభంలేదు. ధనవంతుడు ఏమైనా చేస్తాడు. మోసాన్ని మోసంతోనే ఎదిరించాలి.'

కారు వెళ్లిపోయేదాకా ఆమె ఆగింది. దడదడ కొట్టుకుంటున్న హృదయంతో యాలిస్ అడుగులో అడుగు వేసుకుంటూ బంగళా చేరుకుంది. గొలుసుకి కట్టబడిన ఒక కుక్క భౌభౌమని అరచింది.

'ఎవరది?' అంటూ యింట్లోంచి ఒకావిడ యువతలి కొచ్చింది. కుక్కని రెండు కొట్టి ఊరుకోబెట్టి—

'అక్కడే నిలబడిపోయారేం? ఇలా లోపలికి రండి' అందామె.



పొద్దున ఎనిమిది గంటలు

ఫొటో: సి. వి. నారాయణమూర్తి, (పెరవలి)

యాలిస్ తడబడుతూ 'ప్రసాదుగారు ఉన్నారా?' అంది.

'లేరు, ఫేక్టరీకి వెళ్ళేరు రండి, కూర్చోండి' ఆవిడ యాలిస్‌ను మర్యాదచేసి లోపలికి తీసుకువెళ్ళి సోఫామీద కూర్చోబెట్టింది

'ఉండండి, వస్తాను' ఆవిడ లోపలికి వెళ్లింది ఆమె చాలా నిరాడంబరంగానూ, నిష్కల్మషంగానూ కనిపించింది యాలిస్‌కి. అంత యింటికి ఒక్క నౌకరు కనిపించలేదు ఆమె అన్ని పనులూ స్వయంగా చేసుకోవడం యాలిస్‌కి ఆశ్చర్యం కలిగించింది ఆవిడ బలవంతాన కాఫీ యిస్తూ అంది

'ఆయనా అలా వెళ్ళేరు, మీరూ వచ్చారు సాయంకాలందాకా సరదాగా కబుర్లు చెప్పుకుందాం. అప్పుడు ఆయన వస్తారు'

యాలిస్ మరికొన్ని అబద్ధాలాడక తప్పలేదు

'ఆయనా నేనూ చిన్నప్పుడు చదువుకున్నాం ఇక్కడ ఉన్నారని తెలుస్తే ఓమారు చూసిపోదామని వచ్చాను. ఎప్పటిమాట! ప్రసాదుగార్ని చూసి ఆరేళ్లయింది అప్పటికి మీ కింకా పెళ్లి కాలేదేమో!'

'అవకేం? పదేళ్ల క్రిందటే మా వివాహం జరిగింది' యాలిస్ పెదవులు కోపంతో కంపించాయి పెళ్లయిన నాలుగేళ్ల తరువాత యీ ధూర్తుడు తన సర్వస్వాన్నీ కలుషితం చేశాడు ఆఖరికి తన ప్రాణంలో ప్రాణాన్ని కూడా తనకు తెలీకుండా ఎత్తుకుపోయాడు!

'ఆయనకు పిలలంటే చెప్పలేనంత ప్రేమ నేను కాపురానికి వచ్చిన నాలుగేళ్ల వరకూ పిల్లలే కలుగలేదు అన్ని సంగతులూ నేనే చెప్పేస్తున్నాను మీరు గడుసుతనంగా మాట్లాడ్డమే లేదూ!'

ఆ యిల్లాలి ఆదరణలో పడి తను వచ్చిన విషయమే మరిచిపోయింది ఇంతకీ తన బాబు ఏమైనట్టు? సరిగ్గా నాలుగుగంటలు కొట్టేరు

'అమ్మా! అమ్మా!' అంటూ చిన్న పిల్లవాడు లోపలికి వచ్చాడు. ఆ వయస్సులో ఉన్న యితర పిల్లల్లావాడు ఎగురుతూ, ఊరుకుతూ రాలేదు అతి నెమ్మదిగా, నిదానంగా నడుచుకుంటూవచ్చి, ముందు జోళ్లు విప్పి ఒకమూల పెట్టేడు తరువాత సంచీలో పుస్తకాలు తీసి అలమారాలో క్రింది సొరు

# అమ్మ చాలా మంచిది

సులో తడిచేతి ప్రక్క మూలగా పొందికగా పెట్టేడు. తరువాత తల్లి వళ్ళోవచ్చి కూర్చున్నాడు. యాలిస్ గుండె తీవ్రంగా కొట్టుకుంది.

'చూడమ్మా మోహన్‌బాబూ! కొత్త వాళ్లువస్తే నేనేం చెయ్యమని చెప్పేను?'

ఆ కుర్రవాడు తెల్లని తన పదివేళ్ళూ జోడించి 'నమస్తే' అన్నాడు ముద్దుమాటలతో. 'ఇలారా నాయనా!' అంది యాలిస్. వాడు తల్లి కళ్లవైపు చూసి సమ్మతి గ్రహించి వెంటనే వచ్చాడు. యాలిస్ రెండు చేతులతోనూ వాడ్ని గట్టిగా కౌగలించుకుంది. చెప్పలేనన్ని ముద్దులు కురిపించింది. ఆమె చెంపలు నదీ జలాలే అయ్యాయి

'అదే మమ్మా అలా దుఃఖపడుతున్నారు?' ఆవిడ యాలిస్ కళ్ళు తుడిచింది. కాని అవి ఆగలేదు

నా కొడుకూ బ్రతికుంటే యిన్నేళ్ళ వాడూ వోను.' అంది యింకేమీ అనలేక.

'మాతృప్రేమ అంటే నాకూ తెలీదమ్మా, ఆరేళ్ళ క్రిందట ఆర్ఫనేజ్ నుంచిట ఆయన యీ పసిబిడ్డను తెచ్చేరు కలతపడిన హృదయంలా ఉంది మీది మీ దగ్గిర ఏ విషయమూ దాచ బుద్ధి పుట్టడం లేదు. వీడ్ని కన్నతల్లి ఎవరో నిజంగా ధన్యాత్మురాలు'

యాలిస్ మొహం వివర్ణమయింది. విషయం మార్చుదామని

'ఏం చదువుతున్నావు బాబూ నువ్వు?' అని అడిగింది.

'ఒకటి' అన్నాడు మోహన్. దుస్తులు గాని, క్రాఫింగుగాని ఒక్క పిసరు మాయలేదు. అంత చక్కటి శిశువుకి యాలిస్ జోహారు చేసింది.

'వీడు పాఠం చదువుతాడు వింటారా? బలే తమాషాగా చదువుతాడు లెండి. ఏది మోహన్ మీ వాచకంలో మొదటిపాఠం చదువమ్మా.'

వాడు మరం వేసుకున్నాడు. చేతులు కట్టుకున్నాడు. బుద్ధిగా ముద్దొస్తూ చిలకపలుకుల్తో మొదలు పెట్టేడు. ఆ పాఠమంతా మూడేముక్కలు. యాలిస్ మాతృహృదయం పూర్ణ స్వరూపాన్ని చూడడానికి అవి చాలు.

'మా అమ్మ చాలమంచిది. నన్ను చెప్పలేనంత ప్రేమించును. నాకొరకు ఎంతకష్టమయినను ఓర్చును.'

ఈసారి యాలిస్ కన్నీళ్లు ఆగలేదు. వాడ్ని దగ్గరగా తీసుకుని గోరున ఏడ్చేసింది. అయిదు నిమిషాల్లో అతికష్టపడి ఆపుకుని 'ఇక ఉండలేనమ్మా వెళ్లి వస్తాను. మోహన్‌బాబు ఫొటో ఒకటి ఉంటే యివ్వండి...వస్తాను.' ఆవిడ ఫోటో తీసి యిచ్చింది

'ఆయన వచ్చేదాకా ఉండరూ?'

'ఎందుకని అడగొద్దు, చిన్న కోరిక. నే యిలా వచ్చి వెళ్ళినట్టు ఆయనకి చెప్పవద్దు. ఇది తీరుస్తారని నమ్మకముంది. వస్తాను.'

'మీ హృదయం ఎందుకింత బాధపడుతూందో నాకు అర్థంకాలేదు నావల్ల తెలీకుండా మీకేదైనా అపకారం జరుగుతే క్షమించండి మీరు కూర్చున్న కొద్దిసేపూ ఎవరో ఆత్మీయులతో మాటాడుతున్నట్టు ఉంది. తప్పకుండా మీ కోరిక చెల్లిస్తాను. మీరు మళ్ళీ మళ్ళీ వస్తే ఎంతో సంతోషిస్తాను.' యాలిస్ కళ్ళెత్తి చూసింది. ఆవిడ కళ్లలో నీళ్లు! తన కన్నీళ్ళకి విలువుంది అర్థంకాని ఆ బాధకు? దానికి విలువెంత?

'మోహన్‌బాబూ నమస్తే చెప్పమ్మా.' వాడు అతిముద్దుగా చెప్పేడు.

యాలిస్ తిరిగి చూడలేకపోయింది. త్వరత్వరగా అడుగులు వేసుకుంటూవచ్చి కనపడిన రిక్షాలో కూర్చుని 'స్టేషనుకు పోనియ్' అంది

* * *

యాలిస్ యిల్లు చేరుకునేసరికి తనకోసం ప్లీడరు కనిపెట్టుకుని కూర్చున్నాడు. యాలిస్ వస్తూనే 'నేనే పొరబడ్డాను. మీ అవసరంలేదు. దయ ఉంచి వెళ్ళిపొండి' అంది. యాలిస్ సామాను గదిలో పెట్టి తాళం వేసుకుని మెట్లు దిగింది త్వరత్వరగా ఆవరణ దాటింది. మళ్ళీ తిరిగి, చిన్న పార్కులో గట్టు తీసుకుని చర్చిలోనికి వచ్చింది. ఏసుక్రీస్తు విగ్రహం ముందు ఆమె మనస్సు ఆఖరి విన్నపన యిది:

'మారిన వయస్సులూ మనస్సులూ మావిగాని నీ శిలాప్రతిమ నిర్మలరూపం ఒక్కలాగే ఉంది ప్రభూ! నేను జయించింది - నా మనస్సును ఓడించింది పగ కాదు, మంచితనం, త్యాగం. డబ్బు కుమ్మరించి నా బాబును నేను తెచ్చుకుంటాను ఏం సుఖం? ఈ పేద నిర్భాగ్యురాలు వాడికేం యివ్వగలదు? వెలకి ఎన్నభి గడించే యీ అమ్మ వాడి ముద్దుముచ్చట్లు ఏం తీర్చగలదు? వీటన్నిటిని మించి వాడికిప్పుడున్న అమ్మ ఎంత మంచిది! అంత చక్కగా, అంత మంచి శిశువుతో ఎలా పెంచగలదు? మా బాబు పంచదార పలుకులు ఏ సందేశాన్ని యిస్తున్నాయి? అమ్మ చాలా మంచిది! ఆ మాటలు అబద్ధం కాకూడదు. వాడి ఉన్నతికి నా స్వసుఖం అడ్డంకాకూడదు. నేను కోరిన సుఖంకంటె యింకొకరికిచ్చే సుఖమే ఎక్కువని తెలుసుకున్నాను ప్రభూ.' ఆమె హృదయం పరిపూర్ణతతో నిండిపోయింది

* * *

చర్చిలో గంటలు కొట్టేరు. ప్రార్థనా గీతాలు చక్కని సంగీతంలో, చలని పరిమళంలా వినిపిస్తున్నాయి. యాలిస్ యిల్లు చేరుకుంది ఆమె కళ్ళలో ఆ కొత్త వెలుగేమిటో మిస్సమ్మకు అర్థంకాలేదు! ★

---

ఇంటియజమాని: "ఏమండీ కవిగారూ? మా యింటి అద్దె ఎప్పుడిస్తారు?"

కవిగారు: ఎప్పుడోదాకా ఎందుకండీ! నేను రాయబోయే ఖండకావ్యానికి ప్రభుత్వ బహుమానం అందగానే యిచ్చేస్తాను. సరేనా?"

* * *

"తమరిని ఒకటి అడుగుదామని వచ్చాను. దయచేసి ఏదు

"లేదండీ!"

"...నిమిషాల సేపు తీరిక చేసుకోగలరా?"

"అభ్యంతరంఏమీ లేదండి!"




సీరియల్

"శారద"

## 19

ఎండాకాలం వెళ్ళి వానలు ప్రారంభమైనాయి. బెజవాడలోని పలుప్రాంతాలు మురిగిపోతున్నాయి. ఇళ్ళ చుట్టూ గుంటలలో నీరు నిలచి కంపువాసన కొట్టుతోంది దోమలు, క్రిములు స్వేచ్ఛావిహారం ప్రారంభించాయి ఆ ప్రాంతాల్లో నివసించే జనం అన్నం తక్కువై వేరుశెనగకాయలు, మొక్కజొన్న కండెలూ, నూనె పుణుకులూ, అట్లూ తిని పొట్ట నింపుకుంటున్నారు. ఒకవేళ కొంచెం దగ్గూ పడిశెం, జ్వరం అంటే మాత్రం వాళ్ళకు చప్పున మందిచ్చేనాథుడేడీ? ధర్మాసుపత్రులంటూ ఉన్నాయిగాని, అక్కడ ఇచ్చే నీళ్లు రోగాలు పోగొట్టేపాటి శక్తిగలిగి వుండవు. ఆ బీదవాళ్ళ ఆహారంలో బలంగాని, నిత్యజీవితంలో ఆరోగ్యరక్షణకిగల ఇతర జాగ్రత్తలుకాని ఏవీ వుండవు. చెత్తా చెదారం తిని నీళ్లుతాగి, మండే ఆకలిని అణుచుకోటం మూలంగా వాళ్లు ఎల్లప్పుడు రోగాలకు, అతి సమీపంలోవుంటారు. అవేగనక అంటు జాడ్యాలయితే ఇక అడిగేవాళ్లు లేరు జనం కిక్కిరిసి వుండటంవల్ల, బజార్లు ఇరుకువి కావటంవల్లా, ఇళ్లు మరీ ఒక దానిమీద ఒకటిగా వుండటంవల్లా, అంటురోగం అంకురించిందీ అంటే మంత్రించినట్టు, గబగబ వందలకొద్దీ మనుషులని తుడిచి పారేస్తుంది

అదే జరిగింది ఆయేడు. భాస్కరరావువున్న పేటలో మారుమూల పేవ్‌మెంటు మీద జీవించే ఒక రిక్షావాలాకి కలరా తగిలింది అతనితోటి వారు అది గుర్తించక అతన్ని అట్లాగేవుంచారు. వైద్యం లేక నాలుగైదు గంటల్లో అతను చచ్చిపోయాడు. అది అట్లా అట్లా వ్యాపించింది మూడురోజుల్లో ఇరవైమందికి తగిలింది. పదిహేనుమంది పోయారు. అప్పటికికాని మున్సిపాల్టివారి, ఆరోగ్యశాఖవారు దాన్ని గుర్తించలేదు; ఇక వాళ్లు నిదానంగా, తాబేటి నడకను కార్యరంగంలోకి దిగి వ్యాధి నివారణకు పూనుకున్నారు. దబ్బనంలాంటి సూదులుగల సిరంజీలతో, శానిటరీ ఇన్స్‌పెక్టర్లు పేవ్‌మెంటు జీవులమీద దండయాత్రకు ఉపక్రమించారు. ఆ సూది చూసీచూడగానే వాళ్లు పారిపోతున్నారు పిల్లలు, ఆడవాళ్లు మరీ హడలిపోతున్నారు ఈ దబ్బనం సిరంజి దిగేపాటి కండలెక్కడవి వాళ్ల శరీరాలలో!

ఆ పేటలో, ఏరోజు కూలి ఆరోజు తెచ్చుకునేవాళ్లే ఎక్కువ. పేటకు నడిమధ్యన ఒక మున్సిపల్ మార్కెట్ వుంది. అక్కడి దుర్గంధం అనారోగ్య వాతావరణానికి మకుటాయమానంగా శోభిల్లుతూ వుంటుంది. మున్సిపాల్టి ఆరోగ్య రక్షణ విరులు అటువంటి క్షేత్రంలో మకాం వేస్తారు తొవకి పదిమంది చొప్పున అదే సూదితో పొడిచేస్తున్నారు; ఆ ఇన్స్‌పెక్టర్ల మొహాలలో అప్పుడు మెరుస్తున్న గర్వానికి అర్థం చెప్పడం అసాధ్యం; అది, యుద్ధరంగంలో వెనకడుగు వెయ్యకుండా శత్రువుల్ని ఒక్కొక్కరినే హతంచేస్తున్న వీరాధి వీరుని కళ గావచ్చు. లేదా, దుష్టజంతువుల్ని వేటాడుతూ గురిచూసి బాణాలు వేసి చంపుతున్న వేటగాని ఆనందమైనా కావచ్చు.

భాస్కరరావు ఇంటికి తూర్పుగా కొందరికి కలరా తగిలిందన్న వార్త విన్నప్పట్నించీ పద్మకి కడుపులో కెలుకుతున్నట్టుంది. ఆవేళ రాత్రి భాస్కరరావు కొట్టుదగ్గరనుంచి రాగానే మొదలు పెట్టిందామె—"పొద్దున్నే ఆయనెవరో ఇన్స్‌పెక్టర్ వచ్చి గూ అందరికీ సూది మందు పొడిచిపోయాడు" అని.

"మా కొట్లోగూడా అందరికీ చేశారు పిన్నీ" అన్నాడు భాస్కరరావు.

"ఈ పేట అంతటా కలరాగా వుందటగా? నిజమేనా?" అని అడిగిందామె.

"అయితే ఏం? కాస్త జాగ్రత్తగావుంటే సరి. పైగా ఇనాక్యులేషన్ గూడా చేయించుకున్నాం. ఇంక భయపడవల్సిన పనిలేదు"

"ఏమో బాబూ! నేను..." నసుగుతోంది పద్మ.

"ఏమిటి పిన్నీ, సరిగా చెప్పు."

భద్రయ్యగారు ఏదో ఆలోచిస్తూ కళ్లు మూసుకునివున్న వాడల్లా లేచి, "ఏముందిరా! అది పుట్టింటికి పోతుందట" అని తేల్చాడు.

"ఏం పిన్నీ?" భాస్కరరావు ఇది పాతపాత మేగదా అనుకుని నిర్లక్ష్యంగా అంటూ ఇంటి తడిక నానుకుని నుల్చున్నాడు.

"అవును. నాకేం భయం చెప్పటానికి? నేను మొదట్నించీ మొత్తుకుంటూనే వున్నాను, ఇటువంటి పేటల్లో వొద్దో అని! రేపేం జరుగుతుందో ఎవరు చెప్పగలరు నాయనా? నేను పోతాను



# మంచి - చెడూ



మావూరు. ఈ నరకంలో నేను బతకలేను బాబూ!" అంది పద్మ, తన ఆలోచనకి తిరుగులేదన్నట్టు.

"అయితే పిన్నీ—నాకు ఒక మాట చెప్పు ఇక్కడ వున్న వాళ్ళు మనుషులు కాదనా నీ వుద్దేశం? లేక వీళ్ళంతా చచ్చే వాళ్ళూ నువ్వు ఒక్కతెవే బతికేదానివీనా? ఏమిటి పిన్నీ—నువ్వు మరీను" అన్నాడు భాస్కర్రావు మందలింపు ధోరణిలో.

"నువ్వేమైనా అనుకో అబ్బాయి. నన్ను మాత్రం రేపొద్దున్న బండికి బాపట్ల పంపించెయ్ మా నాన్నా వాళ్ళను చూసి చాలా రోజులైంది. ఒక్క పదిరోజు లుండివస్తాను" అంది పద్మ, సంభాషణ ఇంక సాగించటం ఇష్టంలేనట్టు తల పక్కకు తిప్పుకుంటూ.

"నువ్వు అంతగా వెళ్తానంటే నిన్ను వొద్దనటానికి నేనెవర్ని! అట్లాగే వెళ్దువుగాని లే" అన్నాడు భాస్కర్రావు చిరాకుగా.

"డబ్బు ఖర్చయిపోతుందని దిగులుపడకు నాయనా! నా ముక్కుపుడక అమ్మి నా కియ్యి. చాలు" అంది పద్మ ఎత్తిపొడుపుగా

"పిన్నీ!—" అని అరిచాడు భాస్కర్రావు అంతే ఆపైన ఆమెని ఏమనాలో, ఆమెని ఎట్లా అర్థం చేసుకోవాలో కూడా అతనికి తోచక ఊరుకున్నాడు. స్త్రీ హృదయం ఇంత పాషాణమా అని అతను ఆలోచిస్తున్నాడు అతనికేం తెలుసు అదంతా తన మీద ప్రేమ సెగ వేరక ఈ వికృతరూపం దాల్చిందని! అసలు పద్మకే తనలోని ఈ మార్పుకి నిజమైన కారణం తెలియదు. ఆమె రోజురోజుకీ అట్లా మారిపోతున్నది. ఈ మార్పుకంతా కారణం, పరిస్థితులనే చెప్పాలి.

భాస్కర్రావు తెల్లారకట్ట లేచి పద్మను తీసుకుని స్టేషనుకు వెళ్లాడు. బాపట్ల పోయ్యే ప్యాసెంజరు ఎప్పుడొస్తుందో వెళ్ళి అక్కడి బోర్డులూ అవీ చూసి, ఎవరెవర్నో అడిగివచ్చాడు "ఇంకెంత ఆలస్యం వుంది?" అని ప్రశ్నించింది పద్మ.

"ఏమో! ఆ రైల్వే వాళ్ళకే తెలీదట ఆ సంగతి. ఇక మనకెట్లా తెలుస్తుంది? అన్నాడు భాస్కర్రావు విరక్తిగా.

"అటు చూడు పెద్ద బోర్డు కట్టారు, నాలుగున్నర గంటలకు వస్తుందని!" అంది పద్మ ప్యాసెంజర్ వెయిటింగ్ షెడ్డులో వేళ్ళాడుతున్న బోర్డు చూపించి

"బోర్డులకేం."

ప్యాసెంజర్ షెడ్డునిండా జనం, వాడిపోయిన తోటకూర కాడల్లా పడివున్నారు సగం నిద్రలో. బైట చినుకులు పడుతున్నాయి. చలిగాలి జోరుగా వీస్తోంది. నేలంతా తడిసి బురదగా వుంది లైట్లు వెలుగుతున్నాయి బీడీకొట్లవాళ్లూ, పుస్తకాలమ్మే వాళ్లు ఎక్కడివాళ్లక్కడ కూర్చున్నపాళంగానే జోగుతున్నారు ఏ గూడ్సు ఇంజన్ కూతేసినా పద్మ ఉలిక్కిపడి "గూడు— చూడు మన బండేనేమో" అంటుంది. "కాదులే పిన్నీ. నీ బండి మధ్యాన్నానిక వచ్చినా వచ్చినట్టే" అంటున్నాడు భాస్కరం, కటకటాలకు ఆనుకుని నుంచుని.

"ఏమి రైళ్లు నాయనా! రైళ్లు కూడా వొంటెద్దు బండ్లలాగ వేళాపాళా లేకుండా రావటమేనా యేం?"

"నువ్వు రైళ్ళని అనటం పాపం! అవేం చేస్తాయి? నడిపే మహాత్ములు మనుషులు కాదూ! నోరులేని ఎద్దూ యింజనులూ ఏం చేస్తాయి పిన్నీ! ఊరికే తొందరపడకు. ఎప్పటికోప్పటకి వస్తుంది లే"

"అయ్యో రామ! అసలు వస్తుందో రాదో పోయి కనుక్కురా—పోనీ"

"ఎవర్ని అడగను, దేవుణ్ణి! రైళ్ళ రాకపోకలు, రైల్వే కంపెనీకే తెలియక పోతుంటే గస్తామా మరి!" భాస్కర్రావు నుంచోలేక చతికిలబడ్డాడు, పద్మ కూడా కూర్చుంది విసిగి

బండి ఎట్లాగైతేం ఉదయం ఏడుగంటలకు వచ్చింది ఈలోగానే పద్మ భాస్కర్రావులు రిఫ్రెష్‌మెంటు రూములో కొద్దిగా టిఫిన్ తిని కాఫీ పుచ్చుకున్నారు. భాస్కర్రావు టికెట్టు కొనిచ్చి పైన రెండురూయలు పద్మచేతులో పెట్టాడు ఆడవాళ్ళ పెట్టెలోకి ఎక్కింది ఆమె. ఎక్కి కూర్చున్నాక ఆమెకి కొంత కనువిప్పు కలిగినట్టయింది. బహుశా ఎక్కడికైనా వెళ్ళిపోతున్నప్పుడు ప్రతివాళ్ళకీ అలా కలుగుతుందేమో! భాస్కర్రావు రూపు ఎంత మారిపోయింది! పాపం చినిగిన కోటు కప్పుకుని వానలో తడుస్తూ నుంచున్నాడు. అయినా ఎంత శాంతం! మామూలుగా వుండే ఆ చిరునవ్వు అతని మొహంమీదినించి పోదు! శరీరం వన్నె కొంచెం తగ్గినమాట నిజమే.

"త్వరలోనే వచ్చేస్తా బాబూ" అంది కొంచెం మెల్లగా.

"రా పిన్నీ, ఏదో నీ పట్టుదలచూసి నిన్ను పంపించాను గాని, తోడులేకుండా పంపేవాడా నాన్న నిన్ను? నేనుకూడా వద్దాం అంటే కొట్టుకి వెళ్ళాలి ఇప్పటికే ఆలస్యం ఐంది; నే వెళ్ళి రానా!" అన్నాడు మొహంమీద పడుతున్న వాన తుంపరలు ముంజేతితో తుడుచుకుంటూ.

"వానలో తడవకు, జలుబు చేస్తుంది వెళ్ళు" అంది పద్మ

"నాకేం ఫర్వాలేదు కాని పిన్నీ, నువ్వే చాలా జాగ్రత్తగా వెళ్ళిరావాలి సుమా! మీ అమ్మనీ, నాన్ననీ అడిగానని చెప్పు నాలుగు రోజులలోనే తిరిగిరా నాన్నకి పనికివస్తుందిగాని కొస్త పాత చింతకాయపచ్చడి వుంటే పట్టుకురా" అని చెప్పి భాస్కర్రావు, ప్లాట్‌ఫారంనుంచి, బైటికివచ్చేశాడు మబ్బు అంతటా కమ్మి చీకటి చీకటిగా వుంది. తుంపరు బాగా ఎక్కువనవా విసురుగా కురుస్తోంది భాస్కర్రావు అట్లాగే తడుస్తూ, కొట్టు చేరుకున్నాడు.

## 20

సుదర్శనంగారు, వలవేసి, ఒక యువకుణ్ణి పట్టుకున్నాడు. అతనికి వెనకాముందూ ఎవరూ లేరు ఎట్లా బతుకుతున్నాడో అతనికే తెలియదు. ఉండటానికి నీటుగా, సూటూ బూటూ వేసుకుని దర్జాగా వున్నాడు. అతని మొహంలో పౌడరు మందంగా అలుముకుని వుండటంతో, వయస్సెంత వుంటుందో నిర్ణయించటం కష్టం చలాకీగా మాట్లాడుతాడు. సర్కసు సర్వా స్థలాల్లోనూ, ఎడతెరిపిలేకుండా సిగరెట్లు కాలుస్తూనే వుంటాడు. నిద్రపోయేటప్పుడు అన్నం తినేటప్పుడూ కాసేపాగేమో. ఇంతా చేసి, అయిదడుగుల రెండంగుళాలు—సన్నగా పొట్టిగా. పేరు చంద్రశేఖరం అతని మిత్రులు అతన్ని శేఖర్ అని పిలుస్తారు అయిన వారెవ్వరూ లేరు అలాంటి వ్యక్తి సుదర్శనం దృష్టిలో పడటమే ఒక వింత సంఘటన

ఒక నాడు సుదర్శనంగారు తన కొట్లో కూర్చుని లెక్కలు చూసుకుంటూ వున్నాడు ఎదురుగా వున్న కొట్లో శేఖర్, ఐదారుగురు మిత్రులు చుట్టూ పరివేష్టించి వుండగా గొలుసు వరసలో సిగరెట్లు భస్మం చేస్తూ గుడ్డలు బేరం చేస్తున్నాడు అది ఎంతకీ తెగని బేరంగా వుంది; అసలు కొనే బేరంగాకూడా కనపడలేదు గుడ్డలు

చూపించలేక గుమాస్తాల ప్రాణం కడపట్టిపోతోంది ఆడవాళ్ళే అటూ కొట్టు మొత్తాన్నీ తిరగవేసి చూపించడం పరిపాటి శేఖర్ అదే తంతుగా కనపడుతున్నాడు. చివరికి అతను అర్ధగజం గుడ్డ చేతి రుమాళ్ళకోసం బేరం చేసి కొనుక్కొని మిత్రులతో సహా కొట్లోనుంచి నిష్క్రమించాడు. వాళ్ళు వెళ్ళాక కొట్టు సాంతం మళ్ళీ సర్దుకోవాల్సివచ్చింది. ఆ కొట్టుయజమాని సుదర్శనం గారికి బాగా పరిచితుడు. తీరిక సమయాలలో ఉభయులూ పిచ్చాపాటి మాట్లాడుకోడం కద్దు. ఆ వేళగూడా అర్ధగంటదాటాక ఆయన సుదర్శనం గారికొట్లోకి



# మంచీ - చెడూ



వచ్చి కూర్చున్నాడు, ఫాన్ గాలికి ప్రాణం కాస్త తేరుకుంటుంది గదాఅని. సుదర్శనం కొద్దిసేపు ఏవో ఇతరవిషయాలు మాట్లాడాక, "ఇందాక ఎవరో ఐదారుగురు వొచ్చి బేరంచేశారు, ఏమాత్రం కొన్నారేమిటి?" అని ప్రశ్నించాడు ఏమీ తెలియనట్టు.

"రెండు చేతిగుడ్డలు! రూపాయికి అర్ధణా తక్కువ బేరం! వాళ్ళకోసం నేను కొట్టంతా తిరగ తోడవల్సి వచ్చింది. ఈ కాలం కుర్రాళ్లు ఫాషన్లు ముదిరిపోయి మరీ ఆడంగి వేషాలు వేస్తున్నారండి!"

"ఎవరతడు? చాలా నీటుగా వున్నాడు."

"నాకు తెలుసులేండి, అతన్ని."

"అట్లాగా! పెళ్ళి అదీ చేసుకున్నాడా?" సుదర్శనంగారు ఏ యువకుణ్ణి గురించి అయినా ఇదే ప్రశ్న వేస్తాడు.

"ఇంకా కాలేదు, ఘోటక బ్రహ్మచారి లెండి. అట్లా బలాదూరు తిరుగుతున్నాడు"

"పెళ్ళి చేసుకునే వుద్దేశం లేదా?"

"నా కెట్లా తెలుస్తుందీ? అయినా కనుక్కుంటాలెండి. మా కొట్లో గుమాస్తాకి స్నేహితుడే" గుడ్డలకొట్లో షావుకారికి సుదర్శనంగారి బాధ తెలుసు.

"కాస్త కనుక్కోండి" అన్నాడు సుదర్శనంగారు శాక్యంగా.

గుడ్డలకొట్టు షావుకారికిట్లో అలవాటుంది. తన స్నేహితులు, బంధువులూ అందరి పుట్టుపూర్వోత్తరాలు, మూడుతరాల వివరాలు కులగోత్రాలు కనుక్కుంటాడు. క్లుప్తంగా చెప్పాలంటే ఇలాంటి వివరాలకు ఆయన, సజీవ "సర్వస్వం" (వాకింగ్ ఎన్‌సైక్లోపీడియా) అనాలి. పైగా వెయ్యబద్ధాలాడి అయినా ఒక పెళ్ళి చెయ్యమని ఎల్లాగూ అన్నారు కాబట్టి—అవసరమైతే పదివేలబద్ధాలాడైనా పెళ్ళి చేసేస్తాడు

మూడోనాడు, శేఖరం ఆ కొట్లోకిరాగానే షావుకారు సోమసుందరయ్యగారు అతన్ని అతి ఆప్యాయంగా కూర్చోబెట్టి వివరాలు తీశాడు. కాఫీ దొరక్క చస్తున్న శేఖరం, సోమసుందరంగారి వొట్టొట్టి మర్యాదలకి లొంగక నిర్మొహమాటంగా "కాఫీ తెప్పించండి, చిల్లర మార్చిస్తాను" అన్నాడు, జేబులో చెయ్యిపెట్టబోతూ

"అబ్బే, మీ రివ్వటం ఎందుకులెండి. నేనే యిస్తాగా ఎంత భాగ్యం?" అన్నాడు షావుకారు.

ఆ తర్వాత కొన్ని నిముషాలలో శేఖరం పుట్టుపూర్వోత్తరం అంతా లాగేశాడు ఆయన. ఇంకో పనికూడా చేశాడు; "ఏమండి, మీకు ఇంకా పెళ్లి కాలేదుగా? నాకు తెలిసినచోట పిల్ల ఉన్నది, చేసుకోటానికి అభ్యంతరం లేకపోతే..." అని నసిగాడు.

"కట్నం ఏమాత్రం ఇస్తారు" అని చాలా హుందాగా అడిగాడు శేఖరం.

"కట్నమేమిటండి! లక్షాధికారి కూతురు, ఆయన ఆస్తంతా ఆ అమ్మాయిదే."

"అలాగా! అయినా నాకు కట్నం ఆశ ఎంతమాత్రంలేదు. అమ్మాయి చదువుకున్నదేనా?"

"ఆ వివరాలన్నీ, ఆయన్నే అడుగుదాం రండి" అంటూ సోమసుందరంగారు, శేఖరాన్ని తీసుకొచ్చి సుదర్శనంగారికి పరిచయం చేశాడు.

శేఖరం ఐదు నిముషాల్లో, ఏమండీ అనటం మానేసి, "మావగారూ" అని పిలవసాగాడు సుదర్శనంగార్ని.

సుదర్శనంగారికి బహు సంతోషమైంది శేఖరం ఒక్కొక్కటే అడగనూ ఆయన చెప్పనూ "అమ్మాయి చదువుకుందా!"

"ఫిఫ్తుఫారం చదువుకుంది లెండి."

"పాట వొచ్చా"

"బాగా పాడుతుంది. ఇంకోసంగతి చూశారూ, ఆనక చెప్పలేదనుకు నేరు, అమ్మాయికి చిన్నప్పుడే స్ఫోటకం పోసింది మొహంమీద"

"ఆఁ ఫర్వాలేదండి. అందమేం, కొరుక్కు తింటామా?"

ఆ తర్వాత ప్రశ్నలు సామాన్యంగా సాగాయి. పెళ్ళి ముహూర్తం పెట్టటం తరవాయిగా అన్నీ కుదిరినట్టే.

## 21

సుదర్శనంగారి కూతురు సరోజినికీ, శేఖరానికీ పెళ్లి అతి వైభవంగా జరిగింది. పెళ్లిపందిట్లో పీటలమీద కూడా సరోజిని మజ్లిన్ ముసుగుతోనే వుంది. దాన్ని గురించి పెళ్లికి వెంచేసిన పెద్దలూ పిన్నలూ తలా ఒకరకంగా అనుకున్నారు. ఎవరూ, నిజాన్ని మాత్రం ఊహించలేకపోయారు. పెళ్ళికొడుక్కి కూడా ఈ ముసుగులోని రహస్యం ఏమిటో అర్థమైందికాదు. ఇంకో విశేషం ఏమిటంటే శేఖరం యధార్థంగా, ఆ విషయం తెలుసుకోవాలని ఏమాత్రమూ అభిలాష చూపలేదు. సరోజిని మెరుస్తున్న కళ్లకేసి ఒకటి రెండుసార్లు చూశాడు. ఆమె కంఠస్వరంలోని అనిర్వచనీయమైన మాధుర్యాన్ని కూడా విన్నాడు. ఇక ఊహించాడు, ఆమె రూపాన్ని, ఎంతో అందంగా వుంటుంది. సుదర్శనంగారు చెప్పినట్టు కాస్త మచ్చలుంటే వుండవచ్చు. దానివల్ల నష్టమేమిటి? అయినా, లక్షలతో తులతూగబోయ్యే తను ఈ అందాన్ని గురించి ఆలోచించటం అనవసరం. తన క్కావల్సినవి ఇనప్పెట్టె తాళాలు. ఇంతవరకూ తను గడిపిన దౌర్భాగ్యపు జీవితం—అప్పులవాళ్ళతో రోజూ పడుతున్న బాధ నివృత్తి ఐతే అంతే చాలు. పెళ్ళి మేళాలు, మంగళకరంగా మోగుతున్నాయి. శేఖరం పందిట్లో పెద్దలవంక చూశాడు. తన స్నేహితులందరూ చాలా ఉషారుగా వున్నారు ఏవో మాట్లాడుతూ నవ్వుతూ. తన బాకీవాళ్లు ఒకరిద్దరున్నారు; వాళ్లికమీద తనను వెనకటిలాగా నిలేసి అడగరు—నిశ్చయమే! తను ఇవ్వకపోయినా అడిగే ధైర్యం వాళ్లకు ఉండదు. సుదర్శనంగారి అల్లుణ్ణి ఎన్ని గుండెలతో అడగగలరు? మళ్ళీ అతను నవ్వుకున్నాడు, తన ఆలోచనలకి; లక్షల రూపాయలు తన పరం ఐపోతుంటే వందలు పారెయ్యటానికి తను జంకట మేమిటి? వెనకటి దరిద్రపు ఆలోచన అది! ఛీ—ఛీ—

ఇదే తరుణంలో సరోజిని అతన్ని చూసి ఆలోచిస్తున్నది. చిత్రంగా వుంది ఆమెకి. నాన్న అన్న మాట నెగ్గించాడు. ఇతనెవరో తాళి కట్టాడు తప్పకుండా. అందాకా తన మేలిముసుగు తనను కాపాడుతుంది. కాని ఆతర్వాత? ఎప్పుడో ఒక ముహూర్తంలో తన రహస్యం బైటపడుతుంది; అప్పుడిక తను మళ్లీ వెనకటంత బాధపడవల్సిందేగా! దానికీ నాన్న ఏదో వుపాయం పన్నక పోతాడా అని ఆమె కొంచెం ధైర్యం తెచ్చుకొంది. అంతలోకే స్త్రీ సహజమైన స్వభావంవల్ల ఆమె ఇంకో కోణంనించి ఆలోచించ సాగింది. పెళ్లికొడుక్కి ఎన్నేళ్లుంటాయి? మొహం చూస్తే, ఎప్పుడూ ఆ పొడరు పూతలో నిగ

(౬౦-వ పేజీ చూడండి)




గవర్నర్‌పేట సెంటర్‌లో హఠాత్తుగా రిక్షా ఆపమన్నాడు రిక్షాలో చేరగిలపడ్డ పాసెంజర్.

"ఏమండోయ్ రామారావుగారూ!" కేకేశాడు పాసెంజర్. బందర్ రోడ్డువైపుకి తలవంచుకుని వడివడిగా వెళ్ళే వ్యక్తి గతుక్కుమన్నాడు. మెల్లగా రిక్షావద్దకు వచ్చాడు తడబడే అడుగులతో.

సెంటర్‌లో పోలీసు సంజ్ఞతో రిక్షా ప్రక్కనే వుండే అజంతా హొటల్ దగ్గర నిలువబడింది.

"ఏమిటీ! ఏమైనా తిరిగి యిచ్చేదంటూ వుందా!" కాస్త గట్టిగా అన్నాడు రిక్షాలో వ్యక్తి, కాలినడకలో ఎక్కడికో పోతున్న రామారావుతో.

రామారావు నలువైపుల భయంగానూ, సిగ్గుగానూ చూచాడు. నెమ్మదిగా అన్నాడు. "ఇంకేముందండి! రేపు ఫస్టున తప్పక తీర్చేస్తా! వెధవ ఖర్చులన్నీ అనుకోకుండా మీద పడ్డాయి. లేకుంటే యీ నెల్లోనే తీర్చి వుండేవాణ్ణి! ఈ ఒక్కసారి చూడండి నామాట." మెల్లగాఅన్నాడుఆయన కొక్కనికే వినపడేలా! రిక్షావాలాకి అస్పష్టంగానే వినిపించాయి రామారావు మాటలు!

"ఒక్కసారి కాదయ్యా డజన్‌సార్లు చూచాను. ఇంకేం చూడమంటావు? ఓ నెల పెండ్లానికి జబ్బు. మరో నెల నీకు జీత నష్టమూ, ఇంకో నాయనగారి తద్దినమూ, మామగారి తిష్ట!!!ఇవన్నీ వినలేక చస్తున్నా. ఇదిగో..." గొంతు చించుకుంటున్నాడు రిక్షాలోని వ్యక్తి.

"కొంచం మెల్లగా మాట్లాడండి" తల వంచుకునే బిక్కుబిక్కుమంటూ అన్నాడు రామారావు.

"ఏమయ్యోవ్! నే నేమన్నా దొంగనేను కున్నావా? భయపడటానికి; ఆ సిగ్గుఎగ్గులు నీకుండాలి! చిన్నగా మాట్లాడాలి! పది వాళ్ళనుంచి ముఖం చాటుచేస్తున్నావ్? పైగా అభిమానం."

చుట్టూ ఓ పాతికమంది జనం మూగారు. వింతగా చూస్తున్నారు. ఎవరూ ఏమీ మాట్లాడలేదు. రామారావు తల పైకెత్తితే ఒట్టు!

జనంలోనుంచి యెవరో ఇద్దరు మిత్రులు బయటికిపోతూ "ఎవరో ఎగేసేవాడిబాపతు రావోయ్!" అని ఒకరితో ఒకరంటూ వెళ్ళిపోతున్నారు.

"ఏమైనా, ఈనెల తీర్చేస్తానండీ గౌరయ్యగారూ! ఈ ఒక్కసారి క్షమించండి" రామారావు కండ్లలో నీరు గిర్రున తిరిగింది.

"అదీ చూస్తాను. చదువెందుకు కాల్చనా? తిన్న సొమ్ము తీర్చేదానికే ఏడుస్తే...పదరా" రిక్షా కదిలింది. రామారావు త్వరత్వరగా బందర్ రోడ్డువైపు నడిచాడు. రిక్షాఏలూరు రోడ్డునపడిపోతోంది. ముసిరిన జనం పోలీసు యీలతో చెల్లాచెదురయింది.

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

బి. నాదమునిరాజు

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

## 2

గణగణ గణ్ గణ్ రిక్షా శబ్దం చేసుకుంటూ పోతోంది. నున్నటి సిమెంటురోడ్డు పైన డొనులో కాబోలు చక్రాలు గిర్రు గిర్రున తిరుగుతున్నాయి. రిక్షాలాగేవాడి మెదడులో ఆలోచనలు గిర్రున తిరుగుతున్నాయి పాపం! ఎంత అభిమానపడ్డాడో ఆయన. ఎవరో గుమాస్తాలాగున్నాడు. ఏమిస్తారు జీతం?...ఆ! వందరూపాయలు రావచ్చేమో! ఎంత సంసారముందో! ముసిలి తల్లిదండ్రులు 'పెండ్లాం' యిద్దరు బిడ్డలైనా వుంటారు. రోజూ రెక్కలు ముక్కలు చేసుకుంటే రెండు మూడు సంపాదిస్తున్న నాకే చాలడంలేదే! అయినా మేం ముగ్గురమేగా! అందులోను చదువుకునోళ్ళం. మేము చార్‌మినారో, కారింజ బీడీలో తాగుతుంటామాయె. వారేమో కత్తెర మార్కయినా కాల్చుతారు. ఇంక కాఫీ...గుడ్డలు...ఇంటి బాడుగ...... ఏమోలే! ప్రపంచమంతా ఇంతే! పాపం! ఎప్పుడూ మాటపడ్డోడిలాగ లేడు. ప్రాణం పోయినట్టనిపించి వుంటుందేమో! ఆ మొఖం చూస్తావుంటే నా పేగులు వుడికిపోయినయి. మేమయితే తిట్లుతినటం అలవాటయినా పడినాము. తిట్లుతింటూ దండాలు పెట్టూ కాలాన్ని నెట్టుకపోతూ వుంటామాయె! ఏమో! ఈయన మాత్రం మనిషి కాదూ? చెట్టంత మనిషిని సెంటర్లో పట్టుకొని దులిపేశాడే! ఆయనంత బిక్క చస్తున్నా కనికరమైనా చూపాడు గాదు. ఎందుకు చేశాడో అప్పు యీయనదగ్గర. ఆ...ఎందుకోలే! సంసారమన్న తర్వాత అప్పుచేయకుంటే ఎలా గడుస్తుంది. అయినా కలిగినోళ్ళకు దయాదాక్షిణ్యాలుండవేమో! అవే వుంటే వేలూ లక్షలూ ఎట్లా సంపాదిస్తారులే! ఆ రామయ్యగోరు యింకా సిగ్గుతో చచ్చేకొద్దీ యీ గౌరయ్యగోరు మరీ నోరు పారేసుకోవడం...తూ, పాడు ప్రపంచం...గణగణ రిక్షా పరుగిడుతోంది.

## 3

రిక్షా పరుగిడుతోంది. గౌరయ్యగారి ఆలోచనలుకూడ పరుగుతీస్తున్నాయి రిక్షాతో పాటే! అయినా కాలం న్యాయస్థులది కాదు. బిడ్డకు జబ్బు చేసింది కుమ్మెర్గో అంటే యిరవైరూపాయలిచ్చానే! జ్ఞానం వుండొద్దూ? నాలుగు నెలలయింది. రూపాయకు అణా వడ్డీవస్తోందేఅనుకున్నా, కాలం ఎట్లాంటిది. అందులో యేదైనా వస్తువైనా ఖాతా బెట్టుకొనివుంటే సరిపోయేది. ముందు నాకు తెలివిలేదు. ముఖపరిచయాన్ని బట్టే అప్పులిచ్చే వాడెవడయినా వున్నాడూ? తియ్యని మాటలతో దగ్గరికివచ్చి తేలులా కాటేశాడు వెధవ! ఇస్తాడని నమ్మక మేముంది? ఈలా అవమానం చేస్తుంటే నన్నాయిస్తాడు. ప్రతినెలా ఎదో ఒకసాకు నమ్మబలుకుతాడు. మాటలెవరిక్కావాలనుకున్నాడో పాపం!

అయినా పాడుకాలం! పాడుబుద్ధులు! మంచంనిడివినిబట్టి కాళ్ళు చాచుకోవాలిగాని ఎగిరిపడతారు. ఒళ్ళు తెలీకుండా అప్పులు చేసుకొని లోకులచేత తిట్లూ, బెదిరింపులు బడుతూ ఎల్లా బ్రతుకుతారో! ఏమీ ఇస్త్రీ బట్టలు వేసుకోకుంటే, నోట్లో సిగరెటు, కాఫీ, సినిమాలు; విఱ్ఱవీగుతూ వుంటారు గుమాస్తాలు. బ్రతకటమంటూ తెలీకపోతే ఏలానో! నేను కాబట్టి ఈమారుకూడ విడిచాను యింకెవరయినా అవుతేనా...?

డబ్బు డిమాండు బజారులో పెరిగిపోతోంది. ఇల్లాంటి చిల్లర అప్పులన్నీ వసూలుచేసుకుని యిప్పుడు మొత్తంగా పెద్ద లాభం పొందకుంటే యింక జన్మలో యిటువంటి ఛాన్సు దొరకదు. పాడు ముండ్రి వాళ్ళు అంతా యీలాగే! రాకుండా పోదు గాని అప్పుడు కొంత అప్పుడు

(౬౫-వ పేజీ చూడండి)





వెయ్యి సంవత్సరాలు వయస్సుగల 'త్రిధారి' చెట్టు

←కొండవీడు కొండపై వెదుళ్ళ చెరువు

## ...వీడు
## ...లు

...శ్రీనివాసరావు



# బొమ్మరిల్లు

## ★ సాలీడు—ఈగ ★

చావలి రామచంద్రరావు

కథకుడు :—

అనగనగా ఒక సాలీడూ!
అతి నేర్పరి యీ సాలీడూ!
వింతవింతగా ఎంతో పసందుగ
నిర్మించిం దొక బూజు మహల్!
మహాలు మధ్యలో తిష్ఠ వేసి అది
వచ్చేపోయే వారలనందరి
లోనికి రమ్మని ఆహ్వానిస్తూ
స్వాహా చేయును అతిథులనూ.
ఇటులుండగ ఒక ఈ గొకసారి
ఎగురుతు ఆ దిశ కొచ్చిందీ!
ఆ ఈగను దిగమ్రింగుటకొరకై
వేసెను పాచిక సాలీడూ.
లేని ప్రేమ తెగ ఒలకబోయుచూ
కులుకుచు పలికెను సాలీడూ—

సాలీడు :—

"ఎన్నాళ్ళాయెను ఈగతమ్ముడూ,
నిన్ను జూచి ఈ పాడుకళ్లతో!
రమ్ము రమ్ము నా భవనంలోనికి
జాగెందుకు నా చిట్టి తమ్ముడూ!
నీ జన్మలో నివెన్నడు కని విని
ఎరుగని మహలిది తెలిసిందా?
సందేహించకు ముచ్చటైన నా
ముద్దుల మహాలుకు రారాదా?
అదిగో! ఆ వలలో నిర్మించిన
వాకిలిదోవన వచ్చావా
వింతవింత విడ్డూరాలెన్నో
విశదముగా నే చూపిస్తా."

ఈగ :—

"అన్నా! అన్నా! సాలీడన్నా!
ఫలితంసున్నా; వినుమన్నా!
నీభవనంలో అడుగిడువారిక
తిరిగి రారు మరి తెలుసన్నా!"

సాలీడు :—

"ఎంతో ఎత్తున ఎగిరిఎగిరి తెగ
అలసిపోయినట్లున్నావూ.
ముచ్చటైన నాముద్దుపాన్పుపై
విశ్రమించగా రారాదా?
వింతవింత తెరలెన్నో పాన్పుకు
సొంపుమీర కట్టించానూ.
మెత్తని, సన్నని దుప్పట్లెన్నో
మెత్తమెత్తగా పరిచానూ.
విశ్రమించగా మనసుంటే నే
నిపుడే స్వాగతమిస్తానూ!
పట్టుపాన్పుపై పరుండబెట్టి
చిట్టితమ్ముడా జోకొడతానూ."

ఈగ :—

"వద్దు, వద్దు, నీపానుపొద్దులే.
పాన్పుమహిమ నే విన్నాలే.
దానిపైని నిదురించినవారిక
తిరిగి లేవరని తెలుసునులే."

సాలీడు :—

"ఈగ తమ్ముడూ నేనేం జేతును
యింతగ నన్ను నుమానిస్తే!
యిదిగో నీపై నామదిలో గల
ప్రేమకు రుజువిదె కనుమోయీ!
కమ్మకమ్మనీ మిఠాయి లున్నవి
వంటశాలలో కొల్లలుగా
ఆహ్వానిస్తున్నా నే నిప్పుడు
ఆరగించిపో త్వరత్వరగా."

ఈగ :—

"నీకూ మరి నీమిఠాయీలకూ
నమస్కారమో దయానిధీ!
నీ వంటింటిలొ సరుకు రహస్యం
నే నిదివరకే విన్నాలే."

సాలీడు :—

"చక్కని గాజుల రెక్కలునీవీ!
ధగధగమెరిసే కన్నులునీవీ!
ఎంత తెలివి గల వింతజీవుడవు
ఈగనేస్తమా! హాస్యనిధీ!
చిత్రవిచిత్రపు నిలువుటద్దములు
నాభవనంలో కలవెన్నో.
ఒక్కసారి నీవడుగిడితివమరి
పోనేపోనంటావుసుమా!"

ఈగ :—

"వందనమన్నా! సాలీడన్నా!
నీ యాదరణకు జోహారన్నా!
ప్రేమలుచిలికే నీపలుకులు విని
నామదిపొంగెను వినుమన్నా.

మరియొకపరి నే తప్పక వచ్చెద
క్షమించు మిప్పటికోయన్నా"

కథకుడు :—

ఈగమాటలకు సాలీడప్పుడు
"సరేసరే" యని తలవూపీ
సరాసరిగ తన భవనంలోనికి
చరచర బోయెను హుషారుగా.
వెర్రి మొర్రియా ఈగెటుదిరిగీ
త్వరలోనే తిరిగొచ్చునని.
మదిలో పొంగుచు సాలీడప్పుడు
రంగురంగు దారంబులతో
అలంకరించెను అందముగా తన
సుందరభవనం స్వర్గంలా!
ఈగెపుడొచ్చును ఎపుడు భుజింతును
అని సాలీడతి కోరికతో.
వేచియుండెనా ఈగరాకకై
దారికాచి తన ద్వారంలో.
ఇంతలోనె యా వెర్రి ఈగ మరి
ఎగిరిఎగిరి అటె వచ్చిందీ.

ఈగను గనియా సాలీడప్పుడు
పొంగుచు అతి ఉల్లాసంతో
ఆడుచుపాడుచు ఆప్యాయంగా
అతిహుషారుగా పలికిందీ:—

సాలీడు :—

"వచ్చేశావా వచ్చితివా ఓ
ప్రాణసఖా! వచ్చేశావా?
ముత్యపుచిప్పల మెరుపులమించెడి
ముద్దుల రెక్కల సుందరుడా!
పచ్చని ఎర్రని పసందు దుస్తులు
తురాయి శిరమునగలవాడా!
కన్నులు చెదిరే వజ్రపు కాంతులు
చిమ్మెడి కన్నులు గలవాడా!
నిన్ను మించి ఈ భూలోకంలో
అందగాడు ఎందున్నాడూ!"

కథకుడు :—

అని సాలీడతి ఆప్యాయంగా
అన్న మాటలకు ఆ ఈగా!
తన అందానికి మురిసిమురిసి మరి
తన్నుతానె అది మరచిందీ!
ఆమాటల గల అపాయమెరుగక
వలపై గ్రక్కున వాలిందీ!
వాలిన వెంటనె పట్టెను ఈగను
వల ఉచ్చులతో సాలీడూ.
ఉచ్చున చిక్కిన ఈగను వేగమె
ఉదరంలో గల స్వర్గంలో
పట్టుపాన్పుపై పరుండబెట్టీ
చిచ్చిగొట్టె నా సాలీడూ.
పాపం! అప్పటికిప్పటికీయూ
ఈగ తిరిగి మేల్కొనలేదూ.
సాలీడుదరంబను స్వర్గంలో
శాశ్వతముగ నిదురించిందీ.

హెచ్చరిక :—

అబ్బాయీలూ! అమ్మాయీలూ!
మరువకండి మీ రీసత్యం!
యిచ్చకాలకూ, ముచ్చుమాటలకు
ఉబ్బి దుష్టులకు ఎరలైతే,
ఈగమాదిరే సర్వనాశనము
జరిగితీరునని ఎరుగండీ!







# కర్పూరద్వీపయాత్ర

(బొమ్మరిల్లు సీరియల్) నోరి నరసింహశాస్త్రి

## 35

నీవెప్పుడన్నా తిరపతికొండ ఎక్కావా? తెలుగువాళ్ల ఇలవేల్పు వెంకటేశ్వరస్వామి అక్కడ వెలసి ఉన్నాడు. ఏడుకొండలవాడు వెంకటేశ్వరుడు ఆ కొండకు శేషశైలము, శ్రీశైలము, గరుడాచలము వెంకటాద్రి, నారాయణాద్రి, వృషాచలము, వృషభాద్రి — మొదలైన పేర్లు ఉన్నవి నడిచివెళ్ళినా కారులో వెళ్లినా ఏడుకొండలూ దాటితేనే శ్రీ వెంకటేశ్వరస్వామి దర్శనము!

కొండపైన శ్రీ స్వామి పుష్కరిణికి దగ్గరలోనే గోగర్భమనే పుణ్యతీర్థమున్నది. వెనక కామధేనువు అక్కడ అడుగుపెట్టడంవల్లనే అది పుణ్యతీర్థమయింది. ఆ అడుగు ఇంకా అక్కడ పెద్ద బిలంగా కనపడుతూనే ఉంటుంది.

గోగర్భానికి దగ్గరలోనే ఒక గోశాల శ్రీ వెంకటేశ్వరస్వామిది ఉన్నది. దాన్నే గోష్ఠము అంటాము. అందులో ఆవులు, కోడెలు, ఆబోతులు కావలసినన్ని ఉంటవి. స్వర్గాన్నుంచి వస్తూ దారిలో మరిచిపోక కామధేనువుకు మొక్కివచ్చిన పుణ్యాత్ములు మనుష్యజన్మలెత్తేముందు ఆ గోష్ఠంలో పుట్టుతుంటారు.

సరిగ్గా ఆ ఎనిమిదిమందీ కామధేనువుకు మొక్కిన కాస్సేపటికే వెంకటేశ్వరస్వామి గోష్ఠంలో ఎనిమిది ఆవుదూడలు పుట్టినై. అందులో కోడెలెన్నో పెయ్యలెన్నో సరిగ్గా చెప్పలేను. గోజన్మతో పూర్వజన్మల స్త్రీ పురుష తారతమ్యము పోతుంది!

అవి పెరిగి పెద్దవైనవి. ఒక పెద్ద ఆబోతు, ఒక గంగి ఆవు అందులో ఉన్నవి. ఆ గంగిగోవు పాలే వెంకటేశ్వరస్వామి అభిషేకానికిగాని ఆయనతినే చక్కెరపొంగలికికాని ఉపయోగిస్తారు.

ఆ పుణ్యమైన కొండమీద అవి స్వేచ్ఛగా తిరుగుతూ తమపాదాలు ఉంచినచోటల్లా మరింత పవిత్రంచేస్తూ గడిపినవి.

ఆ కొండమీద పెద్ద అడవి ఉన్నది. అందులో హాయిగా అమృతంవంటి పచ్చిక మేస్తవి.

ఆ కొండమీద అనేకతీర్థాలు ఉన్నవి. అక్కడ హాయిగా అమృతంవంటినీళ్లు తాగుతవి. గోగర్భానికిపోతే కామధేనువు జ్ఞాపకం వస్తుంది. ఆకాశగంగాతీర్థానికిపోతే ఆకాశగంగ జ్ఞాపకం వస్తుంది. పాపనాశనంపోతే వెనకచేసినకొద్ది పాపమూ క్షాళనమయినమాట జ్ఞాపకం వస్తుంది. స్వామి పుష్కరిణికిపోతే స్వర్గంలో నందనోద్యానంలో కల్పవృక్షాల నడుమగాఉన్న ఆనందవాపిక జ్ఞాపకం వస్తుంది ఇంకా నారద తీర్థం, తుంబురుతీర్థం కపిలతీర్థం — మొదలైన అనేకతీర్థాలలో ఈదులాడుతూ స్నానాలుచేస్తూ తీర్థంతాగుతూ ఉంటే, లోగడ స్వర్గంలో తాగిన అమృతానికికూడా కొత్త మేలురుచి కల్పించినట్లుంటుంది. వాటివల్ల వాటి దేహాలు అమృతంకంటె పవిత్రమై మధురమై ఉజ్జ్వలమై వెలుగుతున్నవి.

ఇట్లా కొంతకాలము హాయిగా వెంకటేశ్వరస్వామికి ప్రదక్షిణాలుచేస్తూ గడిపినై. ఒకనాడన్నిటికీ

మనుష్యలోకంలోకి పోవలెనని బుద్ధి పుట్టింది. కామధేనువె దయతో చూసినప్పుడు వారికి కనిపించిన పుణ్యామాతలు రమ్మని పిలుస్తున్నట్లు తోచింది. వాళ్లు సిద్ధసంకల్పులు వాళ్ల కోరిక ఆరాత్రే పెద్దపులి ఆకారంలో వచ్చి తీర్చింది.

మరునాడు తిరుమల తిరుపతికొండమీద గగ్గోలుపుట్టింది గోష్ఠంలో ఆబోతు గంగిగోవుతో సహా ఎనిమిదిగోవులు మాయమైనవని అంతా గందరగోళపడ్డారు. నెత్తురుచారలుచూసి పెద్దపులి ఎత్తుకుపోయిందని కొందరు ఊహించారు అయితే తలుపులు వేసినగోష్ఠంలోకి కటకటాలలోనుండి పులి ఎట్లా వస్తుంది? ఎట్లా గోవులను వేసుకుపోతుంది? పోనీ, దొంగలు వచ్చినజాడైనా లేదు.

ఎవరికీ ఏమీ అర్థంకాలేదు మరునాడు పొద్దున పారుపత్తుదారులు శ్రీ వెంకటేశ్వరస్వామివారికి దేవస్థానం లెక్కలు వినిపిస్తూ—ఎనిమిదిగోవులు మాయమైనవి—అని వినిపిస్తే వెంకటేశ్వరులు చిరునవ్వు నవ్వుకున్నాడు. దేవస్థానంవారికి ఇప్పటికీ ఆ గోవులలెక్క తేలలేదు. ఇక ఎప్పటికీ అంతే!

## 36

హాయిగా అట్లా తిరపతికొండమీద ఉన్నవాళ్ళకు మనుష్యలోకంలోకి దిగిరావలెనని అకస్మాత్తుగా ఎందుకు బుద్ధిపుట్టిందంటారా? అయితే చెబుతా వినండి. అది చెప్పవలెనంటే దానికిముందు మీకొకటి చెప్పాలి. వాళ్ళు స్వర్గంలో ఉన్నప్పుడూ కొండెక్కి ఉన్నప్పుడూ, ఈ భూలోకంలోనూ, అందులో ముఖ్యంగా భరతభూమిలోనూ, జరిగిన కథ అంతా టూకీగానన్నా చెప్పనిది మీకు అర్థంకాదు.

మనుష్యులై పుట్టినవాళ్లందరూ ముఖ్యంగా మూడింటికోసము ప్రయత్నము చేస్తారు.

నాకిది కావాలె అది కావాలె అనే కోరిక అందులో మొదటిది. ఎన్ని వస్తువులిచ్చినా ఇంకా కొత్తవి కావాలెననే వాళ్ల కుంటుంది. ఎడతెగని దాహం. ఎప్పుడూ కొంతమంది పిల్లలు అమ్మనూ నాన్ననూ, ఇది తీసుకురా, అది తెచ్చిపెట్టు, అంటూ విసిగించరూ? ఈ పెరిగిపోయే కోరికనే కామము అంటారు.

మరి కొంతమందికీ—మిఠాయి తినవలెనని ఉండదు కాని మిఠాయి కొనిపెట్టమంటారు. బంతులూ బొమ్మలూ ఏడిపించి కొనిపిస్తారు! ఆడుకోక దాస్తారు. అదికూడా లేకుండా కొందరు మిఠాయికనీ బొమ్మలకనీ బొట్లకనీ డబ్బు తీసుకొని ఏవీ కొనకుండా డబ్బు దాచుకొని—కొనుక్కున్న వాళ్ళవంక చేభిరిస్తూ చూస్తారు. అమ్మా, నాన్నా పండో మిఠాయో తినమని చేతికిస్తే చూస్తూచూస్తూ తినలేక ఖర్చు ఐపోతుందని దాస్తారు. చివరి కది ఏ పిల్లో కుక్కో తినేస్తుంది; లేకపోతే కుళ్లి వాసన పుడుతుంది. వాళ్లనే పిసినిగొట్టువాళ్లంటాము. డబ్బు ఎక్కువైనకొద్దీ ఈ గుణముకూడా ఎక్కువవుతుంది తాము చేతులారా తినరు, ఇంకొకరికి పెట్టరు. దానికోసము ఎన్ని అబద్ధాలైనా ఆడతారు, చేయరాని పనులన్నీ చేస్తారు. ఈ డబ్బునూ వస్తువులనే అర్థము అంటారు.

ఇక కొద్దిమంది ఉంటారు బాగా చూడండి. వాళ్లకెప్పుడూ మంచిపని చేయడమే ఇష్టము బళ్ళో చెప్పే పాఠాలే కాక వేరే మంచి మంచి పుస్తకాలు చదువుతుంటారు. ముచ్చటగా సంగీతాలు పాడతారు. బొమ్మలు వేస్తారు. బొమ్మరిళ్ళు హంసలు నెమిళ్ళు చిలకలు కోకిలలు కడతారు. కలకలలాడుతూ ఆడుకుంటారు. ఆకలి లేనిదే చిరుతిండ్లు తినరు. అబద్ధమాడరు. తమకు చేతనైన సహాయ మందరికీ చేస్తారు. అందరితో మంచిగా ఉంటారు. వారికి ప్రేమే స్వభావము. దీన్నే ధర్మము అంటారు.

ప్రతి మనిషికీ ఈ మూడూ కావలసిందే. కాని కాస్త తారతమ్యము ఉన్నది. ఇందులో ఏది ముఖ్యమో తెలుసుకోలేకనే ఈ మనుష్యలోకమంతా కొట్టుకు చస్తున్నది

తమ కోరికలు తీర్చుకోడమే ముఖ్యమనుకునే వాళ్ళే దొంగతనాలు చేసేనీ, బందిపోట్లు చేసేనినూ; లంచాలు తినేనీ, గొంతులు కోసేనీనూ!



# కర్పూరద్వీపయాత్ర



మరి డబ్బు కూడబెట్టడమే పనిగా పెట్టుకునేవాళ్లున్నారే, వాళ్ళే ప్రపంచంలోకల్లా క్రూరాత్ములు. వాళ్లు తినరు. ఇంకోరికి పెట్టరు. బీద లేదు బిక్కి లేదు సరిగదా, చివరకు పెళ్లాం లేదు పిల్లలని లేదు—అసలు సామాన్యంగా వాళ్ల ఇళ్లల్లో కలకలలాడే పిల్లలే పుట్టరులే

ఈ రెండు రకాలూగాక ఇంకోరకం ఉన్నారు. వాళ్లకు మంచి పనులు చేయడమే ముఖ్యము. అందుకనే వాళ్లు న్యాయంగా డబ్బు ఆర్జిస్తారు. మంచి కోరికలే కోరుకొని డబ్బు వినియోగిస్తారు. టూకీగా చెప్పవలెనంటే, వాళ్ళకు అర్థమూ కామమూ కూడా ధర్మంకోసమే ఉంటవి.

ధర్మము ప్రధాన మనుకునే జనము లోకంలో ఎక్కువవుతున్నకొద్దీ శాంతి పెరుగుతుంది స్వర్గంలోనుంచి ఈలోకంలో పుట్టినవాళ్ళు ఎక్కువైన రోజులలో అటువంటి బుద్ధి ఎక్కువవుతుంది. భూదేవి హాయిగా ఆరోగ్యంగా ఉంటుంది.

అయితే మధ్యమధ్య అర్థమే ముఖ్యము కామమే ముఖ్యము అనే జనం ఎక్కువవుతుంటుంది. దాన్నిబట్టి నరకంలోనుంచి నరాసరి వచ్చి ఇక్కడ పుట్టినవాళ్ళు ఎక్కువయినారని మనము గట్టిగా చెప్పవచ్చు. ఒకే వస్తువు నలుగురూ కావలెనంటే ఏమవుతుందో మీరే ఆలోచించండి! మనిషికీ మనిషికీ స్పర్థలు పెరుగుతవి. పోట్లాటలు కాట్లాటలు సాగుతవి. భూదేవికి జ్వరం తగిలినట్లు అవుతుంది. ఆవిడకి తపన పుడుతుంది ఈజనాన్ని భరించడమూ ఆమెకే కష్టమవుతుంది. భూభార మెక్కువయిందని పురాణాల్లో చెప్పేది ఇదే సుమా!

భూదేవి సుఖంగా ఉండవలెనంటే కిటుకు ఎక్కడఉందో అది మన భరతభూమిలో మొదటినుంచీ తెలుసు. దాన్ని ఋషులు మళ్లీమళ్లీ వెయ్యిగొంతులతో ఎలుగెత్తి చాటుతూనే ఉన్నారు. సంస్కృతంలో లక్షశ్లోకాల గ్రంథం మహాభారతము. అది హిమాలయ పర్వతాలమీద మూడేళ్లు దీక్షగా కూర్చుని వ్యాస మహర్షి వ్రాశాడు తెలుసుగా. అట్లా ఏకధాటిగా వ్రాసి వ్రాసి చివరకు రెండుచేతులూ ఎత్తి ఏమని ఘోషించాడో తెలుసునా?

"ధర్మము ప్రధానము! దానివల్లనే అర్థమూ కామమూ పొందండి!"

భారతధర్మము—భారతీయసంస్కృతి—అని ఉపన్యాసాలు దంచేస్తుంటే మీరెన్నోసార్లు వినే ఉంటారుగాని వ్యాసుడు చెప్పిన ఈ ఒక్కముక్క ఎవరన్నా చెప్పగా విన్నారా? వింటే సంతోషమే. భారతీయసంస్కృతికి అసలుసూత్ర మిందులోనే ఉన్నది. అందుకనే తన గ్రంథానికి మహాభారతమని ఆయన పేరుపెట్టాడు.

(ఇంకావుంది)

## రంగస్థలంపై రసాభాసం

రంగానుభవంలేని యువకుడు తొలిసారిగా కథానాయకుడి వేషం వేశాడు. ఒకదృశ్యంలో కథానాయకుడు 'విలన్'ని పిస్తోలుతో చంపాలి. పిస్తోళ్ళ ధ్వని వినిపింపచేయటానికి తెరలోపల ఒకడు పటాసుకాయ సిద్ధంగా పెట్టుకు నిల్చున్నాడు. ఆ సమయంలో రంగస్థలంమీద యిలా జరిగింది.

కథానాయకుడు: ఓరీ! ఇన్నాళ్లకు నిన్ను సంహారించు అవకాశము నాకు కలిగెను కాచుకొనుము అంటూ పిస్తోలు పైకితియ్యటానికి పంట్లాం జేబులోకి చెయ్యిపోనిచ్చాడు. అతను యింకా పిస్తోలు బయటికి తియ్యకముందే తెరలోపలివాడు తొందరపడి పటాసుకాయ పేలుమనిపించేశాడు. పిస్తోలు లాగూ లోనే పేలిందని గాభరా పడిపోయిన కథానాయకుడు 'హా!' అంటూ క్రిందపడి చచ్చిపోయాడు.

విలన్ వేషం వేసినవాడికి ఏంచెయ్యాలో తోచక వెంటనే వాడిమీదపడి ఏడవటం మొదలెట్టాడు.

—కొతివెంటి సత్యనారాయణరావు, మద్రాసు.

# నకిలీ నెక్‌లేసు

పి. ఎస్. చెన్నూరి

విమల పురిట్లోనే తల్లిని పోగొట్టుకోవడంచేత, విమల తండ్రి జానకిరామయ్యగారు రెండో వివాహం చేసుకోక తప్పిందికాదు.

పాపాయి సంరక్షణ భారం జానకిరామయ్యగారి ద్వితీయ కళత్రం లక్షుమమ్మమీద పడింది. ప్రథమంలో లక్షుమమ్మకి కూడా ఆట్టే కష్టమనిపించలేదు. కాని, కాలక్రమేణా విమలమీద పెరగవలసిన 'వాత్సల్య - మమకారాల' స్థానే 'ఈర్ష్యాసూయలు' పెరగసాగినయ్. కారణం, తానూ అలాంటి పాపాయికి తల్లికావడం కావచ్చు. నిజానికి, తన కుమార్తె కమలమీద చూపే ప్రేమానురాగాలు, సవతికూతురు విమలమీద చూపలేకపోయినా, ఇరుగుపొరుగు యేమనుకొంటారో నన్న భీతిచేత, పైకిమాత్రం కపటప్రేమ నటించేది.

ఈ విషయం జానకిరామయ్యగారు గుర్తించకపోలేదు. కాని, జోక్యం కలిగించుకొన్నా ప్రయోజనం వుండదని గ్రహించి, తెలిసీ తెలియనట్టు వుండిపొయ్యేవాడు.

రోజులు గడుస్తున్నయ్. విమలా, కమలా పెరిగి పెద్దవారయ్యారు. ఆ యేడే యిద్దరికీ పెళ్లిళ్ళయి అత్తవారింట కోడరికం చేస్తున్నారు కూడాను.

సంక్రాంతి దగ్గర పడుతోంది; కూతుళ్ళనీ అల్లుళ్ళనీ తీసుకువొచ్చి యథోచితంగా సత్కరించి పంపించవలసిన బాధ్యత తమకి వుంది కాబట్టి, వారికి ఆహ్వానం పంపక తప్పింది కాదు జానకిరామయ్యగారికి.

ఆ రాత్రి జానకిరామయ్యగారు భార్యవద్ద సంక్రాంతి కానుకల విషయం ప్రస్తావనకి తెచ్చాడు. తమ అల్లుళ్లకి బహూకరించవలసిన కానుకల నిర్ణయానంతరం, కూతుళ్ళ విషయం ప్రస్తావనకి వొచ్చింది. చివరికి, ఒక్కోటి ఐదేసి వందల కిమ్మత్తుకి తక్కువకాకుండా, చెరో నెక్‌లేసూ చెల్లించుకోవలసిన కానుకగా ఆమోదింపబడింది. జానకిరామయ్యగారు వెంటనే ఇనప్పెట్టె తెరిచి, వెయ్యి రూపాయలు తీసి, లక్షుమమ్మచేత బెట్టి, మాంచి డిజైనులో, నాణ్యమయిన రవ్వలతో, రెండు నెక్‌లేసులూ ఒకేమోస్తరులో, దగ్గరుండి తయారుచేయించే బాధ్యత ఆవిడకే వొదిలిపెట్టాడు.

తన కుమార్తెతో సమానంగా సవతికూతురికి కూడా ఐదువందలు కిమ్మత్తుచేసే నెక్‌లేస్ చేయించి పెట్టడం లక్షుమమ్మకి యిష్టంలేదు. పైగా ఆ నెక్‌లేసు తన చేతులారా చేయించి పెట్టడమంటే మనసు అంగీకరించడంలేదు. అందుచేత, లక్షుమమ్మ బాగా ఆలోచించి, చివరికి ఓపని చేసింది.

బజారుకివెళ్ళి, కవరింగ్ గోల్డు నగలషాపులో మాంచి డిజైనులో, కళ్ళకి మిరుమిట్లు గొలిపే యిమిటేషన్ రవ్వల నెక్‌లేసు ఒకటి, పాతికరూపాయలు పెట్టికొని, అదే డిజైనులో మంచి రవ్వలతో వెయ్యి రూపాయలూ వెచ్చించి ఓ నెక్‌లేస్ దగ్గరుండి చేయించింది. రెండు చక్కని దంతపుపెట్టెలు తెప్పించి చెరో పెట్టెలో భద్రపరచి వుంచింది.

ఒక్క లక్షుమమ్మతప్పితే వాటిని చూచిన మరెవ్వరూ ఒకటి నకలుదనీ, రెండోది అసలుదనీ తెలుసుకోలేనంత 'ఇది'గావున్నయ్.

ఎదురుచూస్తోన్న సంక్రాంతి రానే వొచ్చింది. అల్లుళ్ళూ కూతుళ్ళూ దిగబడ్డారు. అల్లుళ్ళకి కానుకలు చెల్లించుకున్న తరువాత, కొత్తబట్టలతోబాటు కూతుళ్ళిద్దరికీ చెరో నెక్‌లేసూ తాంబూలంలో పెట్టి లక్షుమమ్మ చేతులారా చెల్లించుకుంది. నెక్‌లేస్‌లు చూసేసరికి



కూతుళ్ళిద్దరికీ చెరో నెక్లేసూ, తాంబూలంలో పెట్టి లక్ష్మమ్మ చేతులారా అందించింది.

# ★ నకిలీ నెక్లేసు ★

కూతుళ్ళ కళ్ళు చెదిరిపోయినై. తాము కోరకుండానే తమకు నెక్లేసులు చేయించి పెట్టినందుకు సంతోషించారు. కాని, లక్ష్మమ్మ చేసిన మోసం ఎవరికీ తెలియదు. పదితులాల విమలకి పెట్టింది గోల్డు కవరింగ్ ఇమిటేషన్ రాళ్ళ నెక్లేసని, తన కూతురు కమలకి పెట్టింది మాత్రమే సిసలైన రవ్వల నెక్లేసనీ ఎవరు మాత్రం ఎలా పసికట్టగలరు?

విమల భర్త తనకు ఆఫీసులో సెలవు మంజూరు కాలేదని మరుసటి రోజే ప్రయాణంకట్టాడు వూరికి. కాని, విమలని నాలుగురోజులుండమని మామగారు బ్రతిమాలటం చేత విధిలేక, విమలను వొదిలిపెట్టి, తానొక్కడే వెళ్ళిపోయాడు.

కమల భర్త కమలతోబాటు మామగారింట్లో నాల్రోజులుండి పోవడానికి వొప్పుకున్నాడు.

ఆనాటిరాత్రి ఎవరిగదుల్లో వారు పడుకుని నిద్రపోతున్నారు. కమల ఓ వేళప్పుడు నిద్రలేచి చూసుకునే సరికి, టేబుల్ మీద పెట్టిన నెక్లెస్ అపుపించలేదు. దీపం పెద్దదిచేసి, తనకి అనుమానం వేసిన చోటల్లా వెదికింది. లాభం లేకపోయింది. చివరికి ఏదో ఆలోచించుకొని దొంగలా అడుగుమీద అడుగేసుకుంటూ విమల గదిలోకి దారితీసింది.

విమల మాంచినిద్రలోవుందేమో జాగ్రత్తగా విమల పెట్టె తెరిచి, ఆవిడ నెక్లేసు కాస్తా సంగ్రహించి, ఏమీ తెలియనివ్వానికి మళ్ళీ వెళ్ళి తనగదిలో పడుకుంది.

తెల్లవారింది. విమల నెక్లేసు కోసం తనపెట్టె తెరిచి చూసుకునే సరికి నెక్లేసు కనుపించలేదు. పాపం! విమల కంగారులో గతుక్కుమంది. రాత్రి పడుకునేప్పుడు నెక్లేస్ పెట్టెలోనే పెట్టినట్లు తనకి బాగా జ్ఞాపకం! ఇంతలో ఎలా మాయమయిందో ఆవిడకి అర్థం కాలేదు.

నెక్లేస్ పోయిన సంగతి ఇంట్లో అందరికీ తెలిసిపోయింది. ఇంటిల్లిపాదీ వెదకడం ప్రారంభించారు. నెక్లేసు దొరకలేదు సరికదా మామగారి దగ్గర చివాట్లుకూడా తప్పలేదు.

విమల తన దురదృష్టానికి తనను తాను నిందించుకుంది.

కమలమాత్రం తను చేసిన ఘనకార్యానికి లోలోపల తన్నుతాను అభినందించుకుంది.

తనుచేసిన కుట్ర బయటపడడానికి ఆస్కారంలేకండా, విమల నెక్లేసుని పోగొట్టుకుని సాయపడినందుకు, లక్ష్మమ్మ లోలోపల సంతసించింది.

జానకి రామయ్యగారికిమాత్రం యిందులో యేదో మోసం జరిగిందని అనుమానంగానే వుంది.

మరునటిరోజే కమలా, కమల భర్తా తమవూరు వెళ్ళిపోయారు.

విమల తన భర్త రాకకోసం ఎదురుచూస్తూవుంది.

ఆరోజు ఎందుకో దొడ్లోకి వెళుతోంటే, యింటిచూరులో ఏదో మిలమిలలాడ్డం జానకి రామయ్యగారి కంటబడింది తీరా దగ్గరికి వెళ్ళి చూచేసరికి, నెక్లేసు! ఇది యెలుకలు చేసినపనేనని, జానకిరామయ్యగారికి అర్థంకావడానికి, అట్టే కాలం పట్టలేదు. పోయిన వస్తువు దొరికినందుకు జానకిరామయ్యగారు సంతోషంగా వున్నారు లక్ష్మమ్మగారుకూడా పైపైకి సంతోషం ప్రకటించినా, లోలోపల తన బండారం బయటపడుతుందేమోనని భయంగానే వుంది. ఇహ, విమల సంతోషానికి మేరలేకపోయింది ఆరోజే విమల భర్త రావడం, మరునాడు విమల తన భర్తతోబాటు తమవూరికి వెళ్ళిపోవడం జరిగింది.

రోజులు దొర్లుతున్నయ్.

ఒకరోజు జానకిరామయ్యగారికి, కమల భర్తవద్దనించి ఓ వుత్తరం వొచ్చింది:—

“మీరు యింత నీచానికి వొడికడతారని మేము కల్లోకూడా అనుకోలేదు. ఐదువందలు కిమ్మతుచేసే నెక్లేసని చెప్పి, మీ కుమార్తెకు కవరింగుగోల్డు ఇమిటేషన్ రాళ్ళ నెక్లేస్ పెట్టి పంపారు. మీ మతలబు మా కర్థం కాలేదు. అసలు, మిమ్మల్ని మాకది పెట్టమని అడిగినవాళ్ళెవరు?” - అని.

జానకిరామయ్యగారు ఆ వుత్తరాన్ని చదువుకుని మండిపడ్డాడు. ఉత్తరాన్ని లక్ష్మమ్మముఖానకొట్టి, అసలు విషయం యేమిటో చెప్పమని గద్దించి అడిగేసరికి, విధిలేక తను చేసినఘనకార్యం కాస్తా పూనగుచ్చినట్టు చెప్పేంది. ఈవిషయం, ఏనాటికయినా బయట పడుతుందని ఆమెకు ముందే తెలుసు. కాని, విమలకు పెట్టిన నకిలీనగ కమలకెలా బదిలీ అయిందో ఆమె కర్థం కాలేదు.

జానకి రామయ్యగారికికూడా ప్రథమంలో అంతా అగమ్యగోచరంగా వున్నప్పటికీ, తన చిన్న కుమార్తె కమల గుణగణాలు ఎరిగినవాడవడంచేత, జరిగిందంతా చూచాయగా వూహించుకోగలిగాడు.

“అంతేలే, నీ ఓర్వలేనితనం నిన్నే కొట్టింది నీమేనల్లుడికి, ఏం జవాబురాస్తావో నువ్వే రాసుకో, దరిద్రప్పీనుగా!” అని, హేళనగా నవ్వేసరికి, లక్ష్మమ్మమూతి, ఇంతైపోయింది. కాని, నకిలీనగ కమలకి ఎలా బదిలీ అయిందో, ఆవిడికి, ఇంకా అగమ్యగోచరంగానే వుంది. ★

# గోపిగాడి నామరహస్యం

**జయంతి రామారావు**

ఒంగోలునుంచి మా మామ గారికి విశాఖపట్నం బదిలీ అయిందని తెలిసి, దగ్గరలో కొచ్చేరు కదా అని చూడ్డానికి వెళ్లేను. గోపిగాడు గుమ్మంలో గోలీకాయ లాడుతూ,

"అదుగో జల్ల! తే, రెండు బిస్కట్లు, తే," అంటూ తమ్ముణ్ణి బెల్లిస్తున్నాడు.

"అమ్మా చూడే, అన్నిగాడు బిస్కత్తు లిచ్చి మంటున్నాడూ" అంటూ దీర్ఘం తీస్తూనే వంటింట్లోకి దాడుతీశాడు బుచ్చిగాడు, ఋష్యమూక పర్వతంమీదికి పరిగెడుతున్న సుగ్రీవుడి లాగ.

ఇవ్వకుండా పారిపోతావుకదూ, వెధవా! చూడు నిన్నేంచేస్తానో" అని గోపీ వెంట పడబోతూంటే,

"తగ్గవోయ్ బావా! కొంచెం శాంతించు" అంటూ వెనకనుంచి హఠాత్తుగా రెక్కపట్టుకున్నాను.

ఆ కుదుపుకి తిరిగిచూసి ఆశ్చర్యంతో

"అమ్మా బావొచ్చేడేవ్" అంటూ వంటింట్లోకి పరిగెత్తేడు గోపీ. ఆ తరవాత పలకరింపులు, కుశలప్రశ్నలు మొదలైనవన్నీ అయ్యాక, కాఫీ తాగి, స్నానంచేసి సావకాశంగా కూర్చున్నాను మా బావమఱదులతో పండిత గోష్ఠికి.



"తగ్గవోయ్ బావా! కొంచెం శాంతించు!" అంటూ వెనకనించి రెక్కపట్టుకున్నాను.

ఒకళ్లని కాదంటూ ఒకళ్లు, చివరికి ఏదీ అర్థకాకుండా, ఎడతెఋపిలేకుండా చెప్పుకుపోతున్నారు కబుర్లు. ఒక రకమైన యంత్రంలా నేను "ఊఁ" కొడుతూ ఉంటే, ఒంగోలు సంగతులు, విశాఖపట్నం వింతలు, సినీమా విశేషాలు, వాటిమీద విమర్శలూ, అన్నీ రేడియో ప్రోగ్రాములా జరిగిపోతున్నాయి. మధ్య మధ్య గోపీ గొంతుకమాత్రం మిగతా వాళ్లని అదమాయిస్తూ, అందరిలోకీ ఘాటీగా వినిపిస్తున్నది.

"అఁ, అన్నీ చెప్పేవుకాని అసలు విషయం కదిపేవుకావు గోపీ!" అన్నాను ఒక్కమారు స్విచ్ ఆఫ్ చేస్తూన్నట్లు. "సు ఫోర్త్ క్లాసు చదువుతున్నావ్?"

"క్లాసుకాదు. థర్డ్ ఫారం" అన్నాడు ధాటీగా, అసలే వత్తు 'థా' మీద మరింత వత్తుతూ.

"అబ్బా! అందుకనే నేమిటి



మెడపొడుగు మోహనాంగి
ఫొటో : జి. రామమూర్తి (మద్రాసు)

యింకా చిన్నపిల్లల్తో గోళీలాడుతూ, బిస్కట్లూ పిప్పరమెంట్లూ కాజేస్తున్నావ్?" అన్నాను ఎగతాళిగా.

ఆమాటతో గోపీకి ఎక్కడలేని ఆత్మాభిమానం ఎత్తుకొచ్చింది. సీరియస్‌గా ముఖం పెట్టి,

"అసలా వెధవతో నే నాడననే అన్నాను. కాని వాడే పందెం వేద్దాం రమ్మని, జల్లికి రెండు బిస్కట్లూ, జానకి ఒకటే అని, నేను గెలవగానే ఇవ్వకుండా పారిపోతున్నాడు, "అమ్మే" అంటూ మేకలాగ. అలాంటివాడు ముందెందుకు పందెం వెయ్యాలి?" అని 'లా పోయింటు' తీశాడు గోపీ.

"అవును. నీదగ్గర బిస్కట్లు లేకపోయినా, ఎలాగా గెల్చేస్తానుకదా అనే ధైర్యంతో నువ్వు పందేనికి ఒప్పుకున్నావ్. వాడిదగ్గర బిస్కట్లున్నా, అమ్మదగ్గరకి పారిపోవచ్చు ఎలాగా యివ్వక్కరలేదుకదా అని ఆటకోసం వాడు పందెం వేసేడు. అంతే యిసకతక్కెడా, పేడతక్కెడాను మీ రిద్దరూ. అసలు చిన్నప్పుడు నువ్వుమాత్రం, ఆడుతూండగా నేను గెలిస్తే యిలాగే బామ్మదగ్గరకి పారిపోయేవాడివి కావేంటి? నీదుతమ్ముడు వాడయ్యా నీరజాక్షు!" అంటూ ఆలాపనతో అంతం చేశాను.

ఇంతట్లో బుచ్చిగాడూ వాళ్లంతా 'హాలో హాలో' మంటూ ఒక్కసారి వీధులోకి పరుగెత్తేరు. 'ఇదేమిట్రా' అని నేను విస్తుపోయి చూస్తూంటే,

"సినిమా కారొస్తున్నాది. అందుకూ" అని "నేనుకూడా పేపరు తెస్తానుండు' అంటూ గోపీ పరిగెత్తేడు.

"ప్రేమకోసమై వలలో పడెనే పాపం-పసివాడు. అయ్యో పాపం పసివాడూ" అంటూ బ్యాక్ గ్రౌండుసాంగు కాబోలు వినిపిస్తోంది. అంతట్లో గోపీ "పేదకోసమై గేదెను కొనెనే. పాపం ముసలమ్మా అయ్యో పాపం-ముసలమ్మ" అని పాడుతూ "జై పాతాళభైరవి" అంటూ చేత్తో పేపరు పట్టుకొని ప్రత్యక్షమయ్యాడు.

"పాతాళభైరవి బావా! నిన్న లేవచ్చింది. ఇవాళనుంచి రోజుకి మూడాటలు ఎంతో బాగుంటదట. నిజంగా నువ్వొసమ్మువు

గాని, టిక్కెట్లదగ్గర పీకలు పీకలూ తెగిపోతున్నాయంటే నమ్ము. పోలీసులొచ్చి 'క్యూ'లో నిలబెట్టబోతే దానితోక రేడియోపార్కుదాకా వచ్చిందట."

"ఓస్ అంత కోతే-కాదుకాదు తోకే? ఆ ప్రొప్రయిటరు తప్పు చేశాడుగాని, కారుని తిప్పుతూ, పెట్రోలు కాల్చడమనేకంటె, నీకో కాంప్లిమెంటరీ టిక్కెట్టు పారేస్తే, పదింతల పబ్లిసిటీ చేసుండే వాడివి. పోనీ మరేంచేస్తాం అతనికా అదృష్టం లేదు. అయితే యింకేమేమి టాడుతున్నాయి?"

"స్వర్ణాలో ప్రేమ, లక్ష్మిలో పుట్టిల్లు, మినర్వాలో అత్తింటికాపురం. తర్వాత మాస్కూలుకెదురుగుండా మైదానంలో 'గ్రేట్ యాస్టగన్ సర్కస్' ఆడుతోంది. మొన్న మేమిద్దరం వెళ్ళిచూశాం అదీ బాగానేవుంది."

"నేనూ ఆ సర్కస్‌ని విజయనగరంలో చూశాను. సరేగాని మీ స్కూలెన్నిగంటలకి?"

"పదిగంటలకెళ్ళి ఒంటిగంటకొచ్చేస్తాను" అంటూండగా

"టైమైందికాబోలు అన్నానికి రావురా గోపీ" అంటూ వంటింట్లోంచి "కాల్"వచ్చింది. "ఇదిగో వచ్చేస్తున్నా" అంటూ వెళ్లిపోయాడు గోపీ.

నేనూ ఒక ఆంధ్రపత్రిక తీసి చదువుతూ అక్కడేకూర్చున్నాను. అంతవఱకూ సమపాళంగా ఉన్న శీతాకాలపు ఎండ కొంచెం చురుక్కుమనడం ప్రారంభించింది. అంతట్లో ఎవరో యిద్దరు కుఱ్ఱాళ్ళు వచ్చి,

"రామకృష్ణ ఉన్నాడా అండి?" అన్నారు.

"రామకృష్ణెవరు?" అని అడిగాను పత్రిక చదువుతున్న పరధ్యానంలోనే.

"ఈఇంట్లో ఉండే కుఱ్ఱవాడూ" అన్నారు వాళ్లు.

"ఈయింట్లో రామకృష్ణ అని ఎవరూ లేరు. వాళ్ళీయిల్లు ఖాళీచేసి వెళ్లిపోయారు" అని ధీమాగా చెప్పేశా. అంతధీమాగా ఎలా చెప్పేశానంటారేమో? మా మామావాళ్లూ యిక్కడికి కొత్తగా వచ్చేరుకదా. అంతకుముందీయింట్లో ఆ కుఱ్ఱవాడెవడో ఉండేవాడు కాబోలని గెస్ చేసి చెప్పేశా!

అయితే ఆ యిద్దరు కుఱ్ఱాళ్ళు మాత్రం నావేపు తేరి బారచూసి వెళ్లిపోయారు. తరవాత గోపీ పుస్తకాలుపట్టుకొని స్కూలుకి వెళ్ళిపోతూ,

"ఒంటిగంటకొచ్చేస్తాను" అన్నాడు.

"రైట్ ఛీరియో" అంటే "టాటా" అంటూ వెళ్లిపోయాడు.

భోజనం అయినతర్వాత 'ఫార్మాలిటీ'కోసం పడక చిత్తగించాను. కాని మధ్యాహ్నం నిద్ర అలవాటు లేకపోవడంనించి కన్ను మూసుకున్నా కునుకు పట్టకుండా ఉంది. అలాగే, కటకటాల్లోంచి గళ్లు గళ్లుగా ఎండా నీడా పడుతూంటే ఆగళ్లతో నా దుప్పటీ గళ్లని సరిచేస్తూ, చూస్తూ పడుకున్నాను. ఎప్పుడు నిద్రపట్టిందో తెలీదుగాని గుమ్మంలోంచే "కాఫీ పెట్టండర్రోయ్" అన్న గోపీగాడి కేకతో తెలివొచ్చింది. వెంటనే మళ్లీ టక్కువేశాను.

పుస్తకాలింట్లో పెట్టేసి గోపీ వచ్చి "ఓస్ దొంగనిద్దర" అంటూ దుప్పటీ లాగేశాడు. ఇంకా నేను లేవకపోవడంచూసి.

"పగటి పూట నిద్రింపరాదు. చెట్టుకింద పండుకొనరాదు" అంటూ తన సైన్సుపారం వల్లించి "ఈ మాత్రం తెలీదు. మళ్లీ పెద్ద బి. యస్. సి ఆనర్సు చదువుతున్నాట్ట ఆనర్సు వట్టిడాబే" అన్నాడు, భారతయుద్ధం అయిపోయింతర్వాత మడుగులో దాగున్న దుర్యోధనుణ్ణి పైకి రప్పించడానికి కృష్ణుడూ ధర్మరాజూ ఎత్తిపొడిచినట్టు.

"అయ్యో తెలివా!" అన్నాను హారాత్తుగా లేచికూచుంటూ "పాపం, యిప్పుడు నువ్వు పగలనుకుంటున్నావు కాబోలు. ఒక్కమారు అమెరికా వెళ్లిచూడు. వాళ్లంతా నాలాగే రెండోఝాము నిద్దర్లో ఉంటారిప్పుడు తర్వాత చెట్టుకింద పండుకొనకూడదని మీ మేష్టరు చెప్పేదేమిటి, ఎవరికీ తెలియనట్టు? ఎంత తెలివితక్కువవాడైనా చెట్టుమీద మగ్గి, పండిన పండుకొంటాడు గాని చెట్టుకింద రాలినపండు బేరమైనా ఆడతాడా?" .

"అదికాదు నేనంటున్నది..."

"అవునదే కాదనే నేనూ అంటున్నా. సరేగాని మేట్నీకెళ్దామా?"అని మెల్లిగాఅన్నాను.

"ఆఁ, వెళ్దాం నాకెంతో సరదా... అరె!...మాకిప్పుడు స్కూలుందే

# గోపీగాడి నామరహస్యం

ఎలాగ?" అంటూ గోపీ ఆందోళనపడ్డాడు.

"ఉదయం, ఒంటిగంట కొచ్చేస్తానన్నావ్?"

"అవును. కానీ మళ్ళీ రెండుగంటలకెళ్లి నాలుగుగంటలకి రావాలి. ఇవాళ మా నాన్నగారు కూడా యింట్లోనే ఉన్నారు. ఎలాగా?" అంటూ చెప్పరాని ఆవేదన పడిపోతున్నాడు.

"సరేలే. తరువాత వెళ్దాం. నాకూడా కొంచెం నిద్దరొస్తున్నాది. ఫస్టు షో కెళదాంలే." అని సర్దేశాను అనవసరంగా తొందరపడ్డానే అని విచారిస్తూ.

కాఫీ పటుకొచ్చియిస్తూ "వెళ్లిపోతున్నా"అన్నాడు గోపీ 'మెలాంకలీ'గా.

"మీదే సెక్షను?" అనుకోకుండా అడిగేశాను.

"ఎ. డివిజను. ఏం ఎందుకూ?" అన్నాడు.

"ఏమీలేదు. వట్టినే"

వెళ్లడాని కిష్టంలేక యింకా అక్కడే తచ్చాడుతూఉంటే "ఏంరా గోపీ యింకా టైముకాలేదా రెండూ పదవుతూవుంటే" అన్న వాళ్లమ్మగారి అదమాయింపుతో వధ్యస్థానానికి నెట్టుకుపోబడుతున్న మేకపిల్లలా వెళ్లిపోయాడు గోపీ ఆ పసిహృదయానికి అప్పట్లో కసాయివాడి కత్తిలోకంటె కన్నతల్లికంఠంలోనే ఎక్కువ కటువుదనం కనిపించిందేమో? అనిపించింది! పాపం!

ఈ విచారంవల్లనైతేనేం, వేడివేడి కాఫీవల్లనైతేనేం, మరి నిద్ర పట్టిందికాదు. కాని కాఫీ పడ్డంతో, కత్తిలాంటి ఆలోచన ఒకటి తళుక్కున మెఱిసింది బ్రెయినులో.

"చిన్నగా స్కూలుకే వెళ్ళి, గుప్‌చుప్‌గా గోపీగాణ్ణి తీసుకొని మేటనీకి కొట్టేదాం" అని లేచి పెరట్లోకెళ్లి మొఖం కడుక్కున్నాను. అరనిమిషంలో టాయిలెట్టయి వేగంగా బయలుదేరాను. రోడ్డుమీదికొచ్చింతర్వాత జ్ఞాపకం వచ్చింది" అరె వాళ్ల స్కూలుపేరేదో అడగడం మరిచిపోయినానే"అని. పోనీ ఇంట్లో అడుగుదామంటే పోల్చేస్తారేమో మామయ్యగారుకూడా యింట్లోనే ఉన్నారు. అయినా సర్కస్ టెంటుకి ఎదురుగుండా వాళ్లస్కూలని చెప్పేడుకదా! నోటిలో నాలిక ఉండగా ఆమాత్రం కనుక్కోలేకపోతామా?" అని సైకిలు రిక్షా మాట్లాడి.

"సర్కస్‌దగ్గరకితీసుకుపోవోయ్" అన్నాను.

"సర్కస్ మేటనీ లేదు బాబూ" అన్నాడు వాడు జంకుతూను.

"సర్కస్‌కి కాదు. దానికెదురుగుండా ఒక స్కూలుఉంది. అక్కడికి" అన్నా. మొత్తంమీద నేను నోట్లోంచి నాలికతీసే అవసరమే లేకుండా చిన్నగా స్కూలుగేటు దగ్గరే దింపేశాడు వాడు. లోపలికి ప్రవేశించాను. అన్ని క్లాసుల్లోను పాఠాలవుతున్నాయి. అందులో 'థర్డుఫారం 'ఏ' ఎక్కడుందో? ఎవరినేనా అడుగుదామంటే మన 'డిగ్నిటీ'కి లోపం! అంచేత "ఏమైతే అయింది, అటునుంచే నరుక్కువద్దాం" అనుకుని చిన్నగా ఎదురుగుండా ఉన్న హెడ్మాష్టరు రూములోకే దారితీశాను.

"గుడ్ మార్నింగ్ సార్" అన్నాను.

"గుడ్ మార్నింగ్ రండి కూర్చోండి" అని కుర్చీ చూపించి "ఏమైనా పనిమీద వచ్చారా" అన్నారు హెడ్మాష్టరుగారు.

"ఆఁ ఏమీలేదు. మా అంకుల్‌సన్ యిక్కడ థర్డుఫారం చదువుతున్నాడు. వాడి ప్రోగ్రెస్ ఎలాగుందో ఒకమారు భోగట్టా చేద్దామని."

"ఓ అలాగా? ఆ కుఱ్ఱవాడి పేరు?"

డి. గోపాలరావు థర్డుఫారం 'ఏ' అన్నాను తడుముకోకుండా.

అదో కాగితం మీదవ్రాసి ప్యూన్‌ను పిలిచి

"ఈ పేరుగల కుఱ్ఱవాణ్ణి పంపించమని థర్డుఫారం ఏ. మేష్టరుతో చెప్పు" అని పంపించారు హెడ్మాష్టరుగారు.

తరవాత ఎలిమెంటరీ ఎడ్యుకేషనుమీదా, హైస్కూలు విద్యావిధానం మొదలైన వాటిమీద ప్రసంగిస్తూ.

"అన్నట్టు నిరుడు పబ్లిక్కి మీ స్కూలు పెర్సెంటేజి ఎంతండీ? అని ప్రశ్నించాను.

"ఏమిటో అంత 'సేటిస్ఫేక్టరీ'గా రాలేదండీ. ఫిఫ్టీనైను పెర్సెంటు. ఈయేడు సెవెంటీ దాటుతుందని 'ఎక్స్‌పెక్టు' చేస్తున్నాం." అన్నారు హెడ్మాష్టరుగారు

"ఏమీ ఫిఫ్టీనైనే *It is a fairly good percentage*" అయినా మీ

*ambition* కి మెచ్చుకోవాలి లెండి. అసలిక్కడ యిటువంటి సిన్నియరు *Instruction* ఉంటుందనే పట్టుపట్టి, మా అంకుల్‌తో దెబ్బలాడి మరీ వేయించాను యీ కుఱ్ఱవాణ్ణిక్కడ" స్రుమనికోశానో సొరకాయకోత.

"అవునవును" అని బుఱ్ఱ తటపటాయించి హెడ్మాష్టరేదో రాసుకోవడం మొదలెట్టాడు.

"కొంపతీసి కొత్తవాణ్ణికదా అని నాదగ్గర డబ్బీలు కొట్టడం లేదుకదా యీ హెడ్మాష్టరు" అనుకున్నా. "అలా అయినా మనకోతకి, అతని డబ్బీకి చెల్లయిపోతుందిలే" అని సంతృప్తి పరుచుకున్నాను.

ఇంతట్లో ద్వారందగ్గరేదో చప్పుడవుతోంది. అక్కడేవడో కుఱ్ఱవాడు పిల్లిలా నక్కుతూ నిల్చున్నాడు.

"ఎవర్రా అది" అన్నారు హెడ్మాష్టరుగారు మేఘగంభీరస్వరంతో. ఆ కేకతో అసలే భయంతో సగం చచ్చినకుఱ్ఱాడు బయటికొచ్చాడు. నేను వాడి ప్రవర్తనంతా గమనిస్తున్నాను.

"ఎవరు నువ్వు" హెడ్మాష్టరుగారడిగేరు.

"నేనా-నేనాండి? థర్డుఫారం ఏ."

"ఎందుకొచ్చావిక్కడికి? ఇప్పుడు మీకేమిటి?"

"సోషలు."

"సోషల్ స్టడీస్, మేష్టారెవరూ లేరా?

"ఉన్నారండి."

"ఏం చేస్తున్నారు." బుఱ్ఱవంచి రాసుకుంటూ అడిగారు

"పాఠం చెప్తున్నారండి."

"అయితే పాఠం చెప్తూంటే నువ్వెందుకొచ్చేవురా బడుద్ధాయి? అన్నారు ఒక్కమారు తలెత్తి చేతిలో తిరగేసిన పెన్నుతో బల్లమీద కొడుతూ, దాంతో వాడు హడలిపోయి.

"నేను రాలేదండి. మేష్టారే పంపించేరండీ" అంటూ ఏడుపుమొహంపెట్టేశాడు.

"ఏం? ఏమేనా అల్లరిచేశావా?" అన్నారు హెడ్మాష్టరుగారు బుఱ్ఱటకాయిస్తూ.

"లేదండీ. నేనేం చెయ్యలేదండీ" అంటూ సప్తమస్వరాన్ని ఆలాపించడానికి సిద్ధంగా ఉన్నాడు. అంతట్లో ప్యూనువచ్చి,

"ఇతడేనండి మీరు కాగితం మీద వ్రాసిన కుఱ్ఱవాడు" అని లోపలికి నెట్టేడు.

"ఓహో అలాగా, ఆ మాట యిందాకే చెప్పలేకపోయావా?" అని "రావోయ్ అబ్బాయ్ నీకోసం మీ వాళ్లెవరో వచ్చారు" అంటూ నావేపు తిరిగి, మీరేమిటండీ అలా చూస్తారు? ఇంకా మీ వాడు కాదేమో ననుకున్నాను" అన్నారు హెడ్మాష్టరుగారు.

"వీడు మా వాడు కాడే" అన్నాను.

"అరె! మీవాడు కాడూ?" అని ఆశ్చర్యపడి, ప్యూన్‌ని పిలిచి,

"ఈ కుఱ్ఱవాణ్ణెందుకు తీసుకువచ్చావ్" అన్నారు తీక్ష్ణంగా.

"ఇతనే ఆ పేరుగల కుఱ్ఱవాడని చెప్పి మేష్టారు పంపించేరండీ" అన్నాడు.

"ఒరేఅబ్బాయ్ నీపేరేమిట్రా?" అని కుఱ్ఱవాణ్ణే ప్రశ్నించేరు హెడ్మాష్టరుగారు.

"గోపాలరావండీ."

"ఏం గోపాలరావు"?

"డి అండీ"

"థర్డుఫారమేనా?"

"అవునండీ"

"ఏ డివిజను?"

"ఏ. డివిజను"

"అరె. అయితే మీరేమిటండీ యిలా అంటారు?" అని నా వేపు తిరిగి అని,

"మీ క్లాసులో నువ్వుకాక యింకెవడేనా గోపాలరావనే కుఱ్ఱవాడున్నాడా?" అని కుఱ్ఱవాణ్ణి ప్రశ్నించారు పత్తేదారులాగ.

"లేడండీ"

"ఆశ్చర్యంగా ఉందే" అంటూ గడ్డంకింద చెయ్యిపెట్టుకుని ఆలోచిస్తున్నారు హెడ్మాష్టరుగారు.

"మా వాడు కొత్తగా యీ మధ్యనే జాయిను అయ్యాడు లెండి. జీతం కట్టేశామనుకోండి. కాని యింకా పేరు వెయ్యలేదేమో?" అన్నాను.

"అలా ఉండదండీ పేరు లేకపోతే క్లాసులోకి ఎడ్మిషనే ఉండదు."

"ఒరే నువ్వెళ్లి మీ మేష్టార్ని ఎటెండెన్సు రిజిష్టరు పట్టుకొని రమ్మను." అని కుఱ్ఱవాణ్ణి పంపించేశారు.

కొద్దిసేపట్లో 'చిత్తం' అంటూ వచ్చారు మేష్టరుగారు.

"మీ క్లాసులో ఇద్దరు గోపాలరావులు ఉన్నారా? అందులో కొత్తగా యీమధ్యను జాయిను అయిన కుఱ్ఱవాడుగాని..."

"చిత్తం లేరండీ. ఇందాక తమవద్దకు పంపించిన కుఱ్ఱవాడొక్కడే. డి గోపాలరావు. అతడేనా

సెకెండు ఫారంనుంచి ప్రమోటయి వచ్చినవాడే. కాని యీమధ్యనే ప్రవేశించిన కుర్రాళ్లలో ఒకతని పేరు మాత్రం గోవిందరావు" అని ఊరుకున్నారు.

"గోవిందరావెలా ఉన్నాడండీ, మేమంతా యింట్లో గోపీ, గోపీ అని పిలుస్తూంటాం కదా?"

"అయినా ఒకమారు తమరే వచ్చి స్వయంగా చూసుకుంటే అనుమానం తీరిపోతుంది" అని మేష్టారు నాకు సిఫార్సు చేశారు.

"అవునండీ మీరే వెళ్లి క్లాసులో చూసుకుంటే తెలుస్తుంది." అని సలహాయిచ్చారు హెడ్మాష్టరుగారు.

"కొంపదీసి యీ స్కూలే కాదేమో, యీ స్కూలు పక్కనే మరెక్కడైనా యింకో హైస్కూలుందో ఏమిటో" అనుకొని "అడుగుతే మనగుట్టు బయటపడుతుంద"ని ఆలోచించి, తేలుకుట్టిన దొంగలా నడుస్తున్నాను మేష్టారి వెనకాల. క్లాసంతా కలయజూశాను. గోపీగాడు కనపడలేదు.

"ఈ స్కూలే కాదుగా" అనేసుకున్నాను మనస్సులో. మేష్టారెవరో కుర్రవాణ్ణి,

"గోవిందరావు ఇవాళ క్లాసుకి వచ్చేడా?" అని అడుగుతున్నారు. అంతట్లో ఇందాక హెడ్మాష్టరుగారి దగ్గరకొచ్చిన కుర్రవాడు నన్ను చూసి

"మీరు రామకృష్ణ కోసం వచ్చేరు కదండీ" అన్నాడు. వెంటనే ఉదయమెక్కడో రామకృష్ణ అన్న పేరు విన్నట్లు తోచి, జ్ఞాపకం తెచ్చుకొని,

"ఇవాళ ఉదయం [illegible] మాయింటికి వచ్చాడా?" అని అడిగాను.

"అవునండీ. పెద్దమేష్టారిగదిలో మిమ్మల్ని చూసి, నేను చెప్పేసరికి, పుస్తకాలు నాకొప్పగించి, క్లాసు అసిస్టెంటుని చూడమని, రామకృష్ణ పరిగెత్తేడండీ మిమ్మల్ని చూడ్డానికి"

"అరె. అయితే మాకు కనిపించలేదే" అన్నాను గాభరా పడుతూ

"వెనకతోవంట పెద్దమేష్టారిగది కిటికీదగ్గరకి వెళ్లుంటాడండీ" అన్నాడు వాడు దొంగాడి జాడ దొంగాడికే తెలియాలన్నట్లు.

"వెదీ వెళ్లి పిల్చుకురండి" అని మేష్టారనేసరికి తుఱ్ఱుమన్నారు ఇద్దరు కుర్రాళ్లు.

"ఓహో! ఆకుర్రవాడా? అతను కొంచెం చురుకైన పిల్లవాడేనండి. క్లాసుకి మోనిటరుగా నియమించాను తెలివైనవాడనే" అన్నారు మేష్టారు నవ్వుతూ. ఇంతట్లో ప్రత్యక్షమయ్యాడు గోపీ యిద్దరు మిత్రుల మధ్యాను.

"ఏంరా గోపీ ఎక్కడికి పారిపోయినావ్?" అన్నాను.

"నిన్ను చూడ్డానికే."

"ఏంహోయ్ రామకృష్ణా! నీ పేరు రామకృష్ణ కాదూ? అన్నారు మేష్టారు.

"రామకృష్ణేనండీ"

"అదేంట్రా గోపీ! నీ పేరు గోపీ కాదూ?" అని అడిగాను ఆతృతగా.

"అవును గోపీనే" అన్నాడు చిలిపిగా.

"ఓహో అయితే అదంతా [illegible] నేమిటి? గురువుగారు వంగి అంటేనంది పంది అంటోంది. ఛలే. పరమానందయ్య శిష్యులనే" అన్నాను నవ్వుతూ. పరమానందయ్య అనగానే కోపం వచ్చిందో ఏమిటో,

"అదేమిటండీ మీరింకా అనుమానిస్తారు? ఆ అబ్బాయి పేరు రామకృష్ణే అయితేను. రిజిష్టరులో కూడా అలానే ఉంది. చూడండి" అన్నారు సీరియస్‌గా.

"అవును బావా! నా అసలు పేరు డి. వి. రామకృష్ణ. కాని ఇంట్లో అంతా గోపీ అని పిలుస్తారు. అంటూ అప్పుడు [illegible] తన నామరహస్యాన్ని [illegible] - కాదు - రామకృష్ణ.

"బలే మంచి ఫార్సు జరిగింది. గోపీ గోపీ అని అంతా పిలుస్తూంటే నీ పేరు గోపీనాథో గోపాలరావో అయి ఉంటుందనీ, కాని గోపీనాథ్ అనే పేరు మనలో సాధారణంగా ఉండదు కాబట్టి గోపాలరావనే గెస్ చేసి తడుముకోకుండ చెప్పేశా హెడ్మాష్టరుగారిదగ్గర. బాగానే ఉందిగాని మీనాన్నగారెందుకో నిన్ను తీసుకురమ్మన్నారు పద. మేష్టారూ, యీ కుర్రవాణ్ణి తీసుకెళ్తున్నానండీ," అని చెప్పేసి బయలుదేరాం. బయటికి వచ్చిం తర్వాత 'పుస్తకాలో' అన్నాను. "అవెప్పుడో యింటికి బుక్‌పోస్టు చేసేశాను. నువ్వు వచ్చేవని తెలియగానే పుస్తకాలు వాడికప్పగించి ఫ్రెంచి లీవు పుచ్చుకున్నాను" అన్నాడు పెద్ద హీరోలాగ.

"సాహసివిరా డింభకా! పాతాళభైరవి సిన్మా [illegible] దిగాలా [illegible] మా హీరో, [illegible] సినిమాలకి...... ☆



ఏ. వి. ఎమ్. వారి "సంఘం" తో అంజలీదేవి, ఎన్. టి. రామారావు



అశ్వరాజ్ వారి “అన్నదాత”లో కూతురు అమ్మాజీ, తల్లి అంజలీదేవి.

# సినిమా పరిశ్రమలో మాంద్యం

## ఒక ప్రముఖనిర్మాత అభిప్రాయాలు

చిత్ర నిర్మాణంలో చాల సంవత్సరాల అనుభవం ఉండి, కొన్ని విజయవంతములైన చిత్రాలు నిర్మించి, డైరెక్టు చేసిన ఒక తెలుగు నిర్మాత ఇలాగంటున్నారు:

“ఈమధ్య విడుదలవుతున్న తెలుగు చిత్రాలు వరసగా నష్టపడుతున్నాయి ఈ పరిస్థితి చాలా ఆందోళనకరంగా ఉన్నది. దీనివల్ల ఒకవిధమైన అవ్యవస్థ మన చిత్రరంగంలో ఏర్పడింది

ఇలా నష్టపడడానికి కారణాలు అన్వేషిస్తే, నాకొక ముఖ్య కారణం కనిపిస్తోంది దేశంలో నిరుద్యోగం పెరగడం, డబ్బు విలువ తగ్గడం మొదలైన ఆర్థిక కారణాలవల్ల ప్రధానంగా మధ్యతరగతి ప్రజలు దెబ్బ తింటున్నారు ఇదివరకటిలాగ వారు విలాసాలమీద, వినోదాలమీద బాగాఖర్చు చేసే స్థితిలో లేరు మన చిత్రాలు చాలవరకు మధ్యతరగతి మనస్తత్వాన్ని దృష్టిలో పెట్టుకుని తీసినవి. అందుచేత మధ్యతరగతి ప్రజల అభిరుచులకే అవి అందుబాటులో ఉంటాయి సినిమా ప్రేక్షకులలో అధిక సంఖ్యాకులు కిందితరగతి ప్రజలు తమ అభిరుచులకు తగినట్లు లేకపోవడం చేత, వీరు ఇప్పటి చిత్రాలను ఆదరించడం లేదు. మధ్యతరగతి కుటుంబాలు ఆర్థిక స్తోమత తగ్గనందువల్ల చిత్రాలకు రావడం లేదు ఈవిధంగా మన చిత్రాలు ఈ రెండు తరగతులవారికీ దూరమయ్యాయి మధ్యతరగతి వారి ఆర్థిక స్థితిని చక్కబరచడం మన చేతులో లేదు. కాని కింది తరగతివారి అభిరుచులకు తగినట్లు తీయడం మన చేతులోనే ఉంది ”

సినిమా పరిశ్రమ దుస్థితినిగూర్చి ఆయన ఇంకా ఇలా చెప్పారు

“భారతదేశం ఏడాదికి 250 చిత్రాలు నిర్మిస్తోందని, ప్రపంచంలో మనది ద్వితీయ స్థానమని గర్వంగా చెప్పుకుంటున్నాం. ఎందుకొచ్చిన ద్వితీయస్థానం ఇది? ప్రపంచ

# ★ సినిమా పరిశ్రమలో మాంద్యం ★

మంతటా మార్కెట్ కలిగిన అమెరికా అన్నేసి చిత్రాలు తయారు చేస్తోందంటే అర్థముంది. కాని మూడువేల థియేటర్లకంటె ఎక్కువ లేని భారతదేశం ఎందుకిన్ని చిత్రాలు తయారుచెయ్యాలి? మనకిన్ని చిత్రాలు శుద్ధ అనవసరం. దీనివల్ల ఎంత డబ్బు ముడిఫిలిమ్‌కి, ఇతర పరికరాలకి ఖర్చయి ఇతరదేశాలకు పోతోందో?

తెలుగులో ఏటా పాతిక చిత్రాలు తయారవుతున్నాయి. నిజంగా ఇన్ని చిత్రాలు మన ప్రజలకి కావాలా? నెలకొక్క చిత్రమైతే చాలదా? నెలకి నాలుగేసి విడుదలవడంవల్ల లాభమేమిటి!

నా ఉద్దేశంలో ఇండియా అంతటా ఏడాదికి 50 చిత్రాలు తయారైతే చాలనిస్తోంది. మనదేశంలోకంటె ఎన్నోరెట్లు ఎక్కువగా థియేటర్లు, ప్రేక్షకులు కలిగిన సోవియెట్ యూనియను ఏడాదికి 50 చిత్రాలు మాత్రమే తయారు చేస్తుంది. ప్రతి చిత్రాన్ని యూనియన్‌లోని అన్ని భాషల్లోకి తర్జుమా చేసి అన్ని ప్రాంతాల్లోను విడుదల చేస్తుంది. మనంకూడా ఆ పద్ధతినే అనుసరించవచ్చు. ప్రతి చిత్రాన్ని తగినంత శ్రద్ధ తీసుకుని, మనదేశంలోని వివిధ భాషల్లోకి నిర్దుష్టంగా డబ్ చేసి, అన్ని ప్రాంతాల్లోను విడుదల చెయ్యవచ్చు. తక్కువ చిత్రాలు తయారుకావడంవల్ల ఎంతో డబ్బు వృథా ఖర్చుకాకుండా సద్వినియోగం కావడమేకాక, చిత్రాల స్థాయి తప్పక పెరుగుతుందని నా విశ్వాసం.

ఇదంతా చెయ్యడానికి మన సినిమా పరిశ్రమ పునర్వ్యవస్థీకరించబడాలి. ఈ పని ప్రభుత్వంవల్లనే అవుతుంది. ఈ మాట అంటే చాలమంది నిర్మాతలకు కోపం వస్తుంది. ప్రభుత్వానికి కొంత సందిస్తే అంతా ఆక్రమించుకుంటుందని భయపడతారు. పరిశ్రమ యావత్తూ ప్రభుత్వం చేతులోకి పడితే వట్టి ప్రచార చిత్రాలు మాత్రమే తయారవుతాయంటారు. అటువంటి ప్రమాదావకాశం లేకపోలేదుగాని, ఇప్పుడు నిర్మాత ఎదుర్కొంటున్న ప్రమాదం ముందు అది ఏమంత పెద్దదికాదు. అసలు సినిమాపరిశ్రమను పరిశ్రమ అనడానికే వీల్లేకుండా పోతోంది ఇవ్వాళవచ్చిన నిర్మాత రేపు ఐపు లేకుండా పోతున్నాడు ఇంతమంది నిర్మాతలకు డబ్బెక్కడినుంచి వస్తోందని ఆలోచిస్తే ఆశ్చర్యంగా ఉంటుంది సినిమా "కళ" మీద ఏమాత్రం అభిరుచీ లేనివాళ్లు ఇందులోకి జొరబడుతున్నారు. ఇనపవ్యాపారం చేసీ, పొగాకు వ్యాపారం చేసీ, ఇంకా రకరకాలవ్యాపారాల్లో డబ్బు సంపాదించినవాళ్లు ఈ రంగంలోకి దిగుతున్నారు. వీళ్లమూలంగా చిత్రాలస్థాయి దిగజారిపోతోంది. ఎంత అనుభవంగల, కళాదృష్టి గల పెద్ద నిర్మాతకైనాసరే ఈ రోజున ఆర్థికభద్రత లేదూ, అంటే ఇది పరిశ్రమ అనదగినదేనా? ఇది పరిశ్రమ లక్షణమేనా? కాదు. అందుకే నేను ప్రభుత్వం ద్వారా ఈ పరిశ్రమ పునర్వ్యవస్థీకరించబడాలంటున్నాను. బ్రిటన్‌లో మాదిరిగా, ఫిలిం విచారణ సంఘం (1952) సూచించినట్లుగా, ఫిలిం ఫైనాన్సు కార్పొరేషన్ ఏర్పడాలి. ఫిలిం ఫైనాన్సు ప్రభుత్వం కంట్రోలులో ఉండాలి. దీనివల్ల పరిశ్రమ బాగుపడడానికి అవకాశం ఉంది."

ఆ నిర్మాత తెలుగు చిత్రాల స్థాయిని గూర్చి ఇంకా ఇలాగన్నారు:

"ఇదివరకటి డైరెక్టర్లకీ, ఇప్పటి డైరెక్టర్లకి ఎంతో తేడా కనిపిస్తోంది. కీ॥ శే॥ గూడవల్లి రామబ్రహ్మంగారి, వంటివారు అపారమైన లోకానుభవం సాహిత్య పరిచయం, సంస్కృతి, అభిరుచి కలిగినవారుండేవారు. ఇప్పుడుకూడా అలాంటివారున్నా వారు చాలా అల్పసంఖ్యాకులు. ఇప్పటివారిలో అనేకులకు లోకానుభవం లేదు; సామాజికుల మనస్తత్వం తెలియదు; సారస్వతజ్ఞానం లేదు; జీవితంమీద నిశ్చితమైన, నిశ్చలమైన అభిప్రాయాలు, దృక్పథం లేవు ఇప్పుడు ఎవరుపడితే వారే డైరెక్టరు అవుతున్నారు. కామెరామన్, ఎడిటర్, నటి, నటుడూ ఎవరైనా డైరెక్టరుగా చెలామణీ అవుతున్నారు. వీరికి తమతమ టెక్నికల్ శాఖల్లో విశేషమైన పరిజ్ఞానం, అనుభవం వుండవచ్చు. చెప్పిన పని నిర్దుష్టంగా చేసే విధానం వీరికి తెలిసిఉండవచ్చు. ఎలా చేయాలో తెలుసుగాని, ఏది చెయ్యాలో వీరికి తెలియదు. డైరెక్టరనేవాడికి ముఖ్యంగా తెలియవలసింది "ఏది" చెయ్యాలి అనేదే. ఇప్పుడదే మృగ్యంగా ఉంది. ఇటువంటి దర్శకుల చేతుల్లో పడి చిత్రాల స్థాయి తగ్గిపోయిందంటే ఆశ్చర్యమేముంది?" ★

# గ్లోబ్‌లో రోబ్

ఈనెల 14 వ తేదీనుండి మద్రాసు, న్యూగ్లోబ్‌లో "ది రోబ్" ప్రదర్శింపబడుతోంది. ట్వంటీయత్ సెంచరీఫాక్స్‌వారు సినిమాస్కోప్‌లో, టెక్నికలర్‌లో నిర్మించిన ఈ చిత్రం ప్రేక్షకులను బాగా ఆకర్షిస్తోంది. సుమారు ఆరువారాలపాటు నడుస్తుందట

గ్లోబ్ యజమానులు మద్రాసులోనేకాక బొంబాయి, కలకత్తాలలోకూడా తమ థియేటర్లలో తెరలు పెద్దవి ఏర్పాటు చేశారు తెర సైజు, వెడల్పు 30 అడుగులు, ఎత్తు 18 అడుగులు కొంచెం వంకర తిరిగి ఉంటుంది. హాలంతటా 14 లౌడ్ స్పీకర్లు పెట్టారు. తెరవెనక మూడు స్పీకర్లుంటాయి. సినిమాస్కోప్ హక్కులు ఫాక్స్ కంపెనీవారివైనా, వారిఅనుమతితో మిగతా పెద్ద హాలీవుడ్ స్టూడియోలుకూడా ఈ టెక్నిక్‌లో చిత్రాలు తయారుచేస్తున్నాయి కనుక సప్లయికొరత ఉండదు. మామూలు చిత్రాలు ప్రదర్శించేటప్పుడు మామూలు ప్రాజెక్టరుతోనే తెరమధ్యభాగంలో ప్రాజెక్టు చేస్తారు; మిగిలినభాగాలను అటూ ఇటూ యవనికలతో కప్పివేస్తారు.

"రోబ్" కథ టైబీరియస్ చక్రవర్తి రోమన్‌సామ్రాజ్యంపాలించేరోజులకు చెందినది జీసస్ క్రీస్తు శిలువ వేయబడి, అవసానదశలో "తండ్రీ! తామేం చేస్తున్నారో తమకే తెలియని వీరిని క్షమించు" అంటూ ప్రాణం విడుస్తాడు. శిలువ వెయ్యడంలో తోడ్పడిన రోమన్ అధికారి మార్సెలస్ (రిచర్డ్ బర్టన్) తను శిలువ వేసిన దొక అమాయకుడినని గ్రహించి పశ్చాత్తాపపడతాడు. అతని మనస్సు పశ్చాత్తాపంతో, అశాంతితో నిండిపోయి ఎంతో బాధకు లోనవుతాడు. చివరకు క్రీస్తు ధరించిన ఒక ఉత్తరీయం అతనికి మనశ్శాంతి ఇస్తుంది. ఈ ఉత్తరీయం క్రైస్తవ మత సందేశంలో ఉన్న మహత్తుకు, శక్తికి చిహ్నం. అతడు క్రైస్తవ మతావలంబకుడై, క్రైస్తవసంఘంలో చేరిపోతాడు. ఆరోజుల్లో క్రైస్తవుడు కావడం రాజద్రోహ నేరంగా పరిగణించబడేది కనుక, కొత్తగా చక్రవర్తి అయిన కెలిగ్యులా తన పూర్వప్రత్యర్థి అయిన మార్సెలస్‌కు మరణదండన విధిస్తాడు. అతడు క్రైస్తవు డయినాడు కనుక క్షమతో, చిరునవ్వుతో



ఆంధ్రనాటకకళాపరిషత్తుసభలో శ్రీమతి అంజలి
దేవి సన్మానము స్వీకరించుట.



ఉత్తమ నాటకరచయితగా ఆచార్య
ఆత్రేయకు సన్మానము.

---

## ఆంధ్రనాటక కళాపరిషత్తు
**(బందరు)**

---



ఎ. నాగేశ్వరరావుకు శాలువ బహూకృతి.



"విశ్వశాంతి" "నాబాబు" ప్రదర్శనలలో నటించిన
కె. వెంకటేశ్వరరావుకు వెండికప్పు బహూకృతి.

# ★ గ్లోబ్ లో రోబ్ ★

మరణానికి సిద్ధపడుతుంటాడు. అతన్ని మొదటినుంచీ ప్రేమించిన డయానా అనే యువతి (జీన్ సిమన్స్) తన్ను ప్రేమించిన చక్రవర్తి కలిగ్యులాను తిరస్కరించి తన ప్రియునితోపాటు చనిపోతుంది.

ఈ కథ లాయిడ్ సి. డగ్లస్ వ్రాసిన "ది రోబ్" అనే బిబ్లికల్ నవలనుండి స్వీకరించబడింది మనకు పౌరాణిక గాథలెలాగో పాశ్చాత్యులకు బిబ్లికల్ కథలు అలాగ ఇటువంటి చిత్రాల నిర్మాణంలో పాల్గొనడమంటే టెక్నిషియన్లకు మంచి సరదాగా ఉండి ఉండాలి తమ టెక్నికల్ ప్రావీణ్యమంతా ప్రదర్శించడానికి వీలిచ్చేది ఇటువంటి కథలే.

"ది రోబ్"లో ఫొటోగ్రఫీ నేత్రపర్వంగా ఉంది. శబ్దగ్రహణం శ్రోత్రపర్వంగా ఉందో లేదో కొంచెం అనుమానించదగినదే. ఒక్కసారిగా అన్ని లౌడ్‌స్పీకర్లూ పనిచేస్తున్నప్పుడు చెవుల తుప్పు గుల్లించేటంత గల్లంతుగా ధ్వని వినిపించింది. కాని 'డైరెక్షనల్ సౌండ్'లోని లాభాలు చెప్పుకోతగ్గ స్పష్టంగా కనిపించాయని చెప్పక తప్పదు మామూలు చిత్రాల్లోకంటె సినిమాస్కోప్ చిత్రంలో ఫొటోగ్రఫీ మంచి ఫలితాలు కనబరచింది టెక్నికలర్ కూడా మామూలు చిత్రాల్లో కంటె బాగా, మోతాదుకు సరిపడ సహజంగా ఉంది. కథానాయకుడుగా రిచర్డ్ బర్టన్, అతని ప్రేయసిగా జీనసిమన్స్ (కొన్ని కొన్ని ఆంగిల్స్‌లో ఈమెలో సూర్యకుమారి పోలికలు కనిపిస్తాయి), అతని గ్రీకు బానిసగా విక్టర్ మెచూర్ (శామ్సన్ ఎండ్ డెలీలాలో శామ్సన్) బాగా నటించారు. పెద్దపెద్ద సెటింగులు, అసంఖ్యాకులైన నటీనటులు, రోమన్ సామ్రాజ్యపు వైభవం, అమానుషత్వం, జీసస్ ప్రేమ సందేశం, వీటన్నింటినీ మించి సినిమాస్కోప్ కొత్తదనం - ఇంతకంటె కావలసినదేమున్నది? ఈ చిత్రం ప్రతివారూ చూడదగినది

(సినిమాస్కోప్ విధానంలో - కామెరాకు ఎనమోర్ఫిక్ లెన్సు అమరుస్తారు ఈ లెన్సు సిలిండ్రికల్‌గా ఉంటుంది ఇది బాగా విశాలమైనదృశ్యాన్ని స్వీకరించి మామూలు 35 మిల్లిమీటర్ల ఫిలింమీదనే అడ్డంగా కుదించుతుంది. ఈ ఫిలిమును ప్రాజెక్టు చేసేటప్పుడు ప్రొజెక్టర్‌లో ఉన్న ఎనమోర్ఫిక్ లెన్సు దాన్ని తిరిగి విస్తృతంచేసి విశాలమైన తెరమీద పడేట్టు చేస్తుంది లెన్సు తేడా తప్ప ఇందులో మరే మార్పూ లేదు. శబ్దంకోసం నాలుగు సౌండుట్రాక్‌లు ఉపయోగిస్తారు.

అమెరికాలో సినిమాస్కోప్‌కోసం ఉపయోగించిన తెర 65 అడుగుల వెడల్పు, 25 అడుగుల ఎత్తు ఉన్నది. అంటే మద్రాసులో అమర్చబడిన తెరకంటె చాల పెద్దదన్నమాట.) ★

# దక్షిణభారత ఫిలిం వాణిజ్యమండలి

పై మండలివారి 15 వ వార్షిక సర్వసభ్యసమావేశం ఈనెల 16 వ తేదీన మండలి కార్యాలయంలో జరిగింది 1954-55 సంవత్సరపు అధ్యక్షుడుగా ఎస్. ఎస్. వాసన్ గారు పదవీ స్వీకారం చేశారు పూర్వాధ్యక్షుడైన ఎ. రామయ్యగారు వాసన్‌గార్ని అభినందించి, ప్రస్తుతం విషమ పరిస్థితిలో పడిన సినిమా పరిశ్రమను ఉద్ధరించడానికి మండలి సభ్యులు ఏకోన్ముఖులై పనిచేయాలని విజ్ఞప్తిచేశారు.

వాసన్ గారు తమ్ము అధ్యక్షుడుగా ఎన్నుకున్నందుకు సభ్యులకు కృతజ్ఞత తెలిపారు గడచిన మూడేళ్ళుగా ఎ రామయ్యగారు మండలి అధ్యక్షుడుగా చేసిన కృషిని ప్రశంసించారు. రామయ్యగారు ప్రస్తావించిన 'విషమస్థితిని' గూర్చి మాట్లాడుతూ, చిత్రాలపై వచ్చే రాబడిలో నూటికి 35 వంతులు వినోదం పన్ను కింద పోతోందని, ఇంత ఎక్కువగా మరే పరిశ్రమపైనా పన్నుల భారం లేదనీ, సినిమా పరిశ్రమ అభివృద్ధికి ముఖ్యమైన ఆటంకం ఈపన్నేననీ ఆయన అన్నారు అయినా సినిమానిర్మాతలెవరూ ఈ విషయమై తనంతగా పట్టించుకోవడం లేదని ఆయన అన్నారు

"ఇండియాలో ప్రతి పదిలక్షుల జనులకు ఎనిమిదిమాత్రమే థియేటరున్నాయి. 1700 పట్టణాలకు అసలు థియేటర్లే లేవు. నూటికి 75 వంతుల జనులకు సినిమాలు అందుబాటులో లేవు. ఆ పట్టణాలను, ఆ ప్రజలను మనం చేరగలిగితే మన సమస్య తీరిపోతుంది ఈ విస్తృతాభివృద్ధికి ఆటంకంగా ఉన్నది వినోదంపన్నే" అనికూడా వాసన్‌గారన్నారు.

కొత్త సంవత్సరపు కార్యకర్తలుగా ఈ దిగువవారు ఎన్నుకోబడ్డారు.

అధ్యక్షుడు ఎస్. ఎస్. వాసన్. ఉపాధ్యక్షుడు ఎ. రామయ్య

గౌరవకార్యదర్శులు బి. నాగిరెడ్డి, టి. ఎస్. ముత్తుస్వామి.

గౌరవకోశాధికారి కె. యస్. నారాయణ అయ్యంగార్.

సభ్యులు - ఎ. వి మెయ్యప్పచెట్టియార్, కె. బి. నాగభూషణం, ఆర్. పద్మనాభన్, బి ఎన్ రెడ్డి, పి ఎస్. రామకృష్ణరావు, ఎమ్ సోమసుందరం, ఎస్. కె. రామస్వామి, సి సీతారాం, ఎస సుందరం, టి అశ్వత్థనారాయణ, ఎల్ ఎల్. పటేల్, టి. వి. సుందరం మున్నగువారు.

## వార్షిక నివేదిక

గత సంవత్సరపు వార్షిక నివేదికను మండలి సభ్యులు ఆమోదించారు.

ప్రభుత్వంవారు ఇటీవల అనుసరిస్తున్న సెన్సార్‌షిప్ విధానాన్ని సంస్కరింపజెయ్యడానికి మండలి చాలా కృషి చెసింది. ఈ కృషి కొంత ఫలించినా పూర్తిగా ఫలించలేదు సెన్సార్‌షిప్ చాలా కఠినంగా, నిర్మాతలకు బాధకరంగా ఉంటున్నది సెన్సార్ సభ్యులకు మొదటిసారిగా చిత్రాన్ని చూపించినప్పుడు, తన పక్షాన తన వాదన నిర్మాత చెప్పుకోవడానికి వీలులేకుండా ఉన్నది ఇంతకంటె దారుణంగా ఉన్న దేమిటంటే, కేంద్ర సెన్సార్‌బోర్డు నిర్ణయాలను కూడా అధఃకరించి కేంద్ర ప్రభుత్వం సెన్సారింగ్‌లో జోక్యం చేసుకోవడం.

పన్నుల విషయంలో మండలి ప్రభుత్వానికి కొన్ని విజప్తులు చేసింది ఇన్‌కమ్ టాక్స్, షో టాక్స్, ఎంటర్‌టెయిన్‌మెంట్ టాక్స్ మున్నగువాటిని కొంత సడలించవలసిన అవసరాన్ని తెలియజేసింది. బర్మా, పాకిస్థానలకు భారతీయ చిత్రలను ఎగుమతి చేయడానికిగల ఆర్థిక ఆటంకాలను తొలగించమని ప్రభుత్వాన్ని కోరింది.

ప్రస్తుతం ఈ మండలిలో 237 గురు సభ్యులున్నారు 9 మంది స్టూడియో అధిపతులు, 39 మంది నిర్మాతలు, 6 గురు డీలర్లు, 25 గురు డిస్ట్రిబ్యూటరు, 106 గురు ఎగ్జిబిటర్లు, 45 మంది ప్రత్యేక సభ్యులు; 2 టెక్నికల్ సర్వీసులకు, 5 అఫీలియేట్ సంఘాలకుకూడా సభ్యత్వం వుంది ★

రెండేళ్ళకిందట ఫిలిం విచారణ సంఘం వారు కేంద్ర ప్రభుత్వానికి సమర్పించిన నివేదికను ఇన్నినాళ్ళకు ముక్తికలిగే సూచనలు కనిపిస్తున్నాయి

ఫిలిం ప్రొడక్షన్ బ్యూరో, ఫిలిం ఇన్స్టిట్యూట్, నేషనల్ ఫిలింబోర్డు అనే పేర్లుగల మూడు ప్రత్యేక సంఘాలను నియమించడానికి ప్రభుత్వం నిశ్చయించింది. దీనికి సంబంధించిన ఒక ప్రకటనను సమాచార. బ్రాడ్‌కాస్టింగ్ మంత్రి డా॥ బి. వి. కేస్కార్ పార్లమెంటుకు అందజేశారు.

జాతీయ సంస్కృతిని ప్రతిబింబిస్తూ, విద్యకూ వినోదానికీ ఉత్తమమైన సాధనంగా చలనచిత్రకళను అభివృద్ధిచేసే ఉద్దేశ్యంతో నేషనల్ ఫిల్మ్ బోర్డ్ స్థాపించబడుతుంది. ఈ బోర్డు ఫిల్మ్ ప్రొడక్షను బ్యూరోను, ఫిల్మ్ ఇన్స్టిట్యూట్‌ను, ప్రాంతీయ సెన్సార్ కార్యాలయాలు మూడింటిని ఆదేశిస్తూ, పర్యవేక్షిస్తూ ఉంటుంది. ఇప్పుడు పనిచేస్తున్న కేంద్ర సెన్సార్ బోర్డు అధికారాలను కూడా ఈ బోర్డు ఇకనుంచీ స్వీకరిస్తుంది.

ప్రొడక్షన్ బ్యూరో చేసే పని ఏమిటంటే-స్క్రిప్టులను పరిశీలించి సలహా లిస్తుంది. కథ, సీనేరియో, నటన, నిర్మాణవ్యయం వగైరా విషయాలపై ఆయా నిర్మాతలకు సలహాలిస్తుంది ఒక ఫిలిం లైబ్రరీ నెలకొల్పుతుంది ఫిలిం రిసెర్చి ఏర్పాటు చేస్తుంది. ఈ బ్యూరో ఇచ్చే సలహాలు కేవలం సలహాలేగాని ఆదేశాలు మాత్రం కావు.

సినిమా పరిశ్రమలో వివిధ శాఖల ప్రతినిధులతో ఒక ఫిలిం కౌన్సిల్‌ను ఏర్పాటు చెయ్యాలని ఫిలిం విచారణ సంఘం సూచించింది ప్రస్తుతానికి ఇది సాధ్యపడే విషయం కాదని, అటువంటి కౌన్సిల్ వల్ల పరిశ్రమకు ఉపయోగం ఉంటుందని తోస్తే ముందు ముందు దాని విషయం ఆలోచించవచ్చుననీ ప్రభుత్వం అభిప్రాయపడుతోంది.

ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్ ద్వారా దర్శకత్వం, ఫొటోగ్రఫీ, సౌండ్ ఇంజినీరింగ్ మొదలైనవాటిలో విద్యార్థులకు తర్ఫీదు ఇవ్వడానికి, ప్రాక్టికల్ ట్రెయినింగ్‌కి గాను ఒక చిన్న స్టూడియోను ఏర్పరచడానికి ప్రభుత్వం నిశ్చయించింది.

ఇక బహుమతుల విషయం—అఖిల భారత స్థాయిలో ఉత్తమ కథా చిత్రానికి, ఉత్తమ డాక్యుమెంటరీ చిత్రానికి, ఉత్తమ బాలచిత్రానికీ బహుమతులు. ఇస్తారు, ప్రాంతీయంగా కూడా వివిధభాషల్లోని ఉత్తమ చిత్రాలకు బహుమతులిస్తారు.

ఫిలిం ఫైనాన్స్ కార్పొరేషన్ ఏర్పరచడం వ్యాపారరీత్యా చిక్కులతో కూడినదే కాక, ప్రస్తుతం పంచవర్ష ప్రణాళిక అమలు చెయ్యడంలో మునిగిఉన్న ప్రభుత్వం దీనికి వేరెనిధిని ఏర్పాటుచెయ్యడం కష్టమని అభిప్రాయపడుతోంది.

దేశమంతటా వినోదం పన్నుని ఒకే రేటులో నిల్పయించే విషయమై వివిధ రాష్ట్ర ప్రభుత్వాలతో కేంద్రప్రభుత్వం సంప్రదిస్తోంది.

పిల్లల చిత్రాలను ప్రోత్సహించడానికి బహుమతు లివ్వడమే కాక, ప్రభుత్వంవారి ఫిల్మ్‌శాఖ రెండు బాలచిత్రాలను ప్రస్తుతం నిర్మిస్తోంది ★



## ★ సినిమా వార్తలు ★

కె. ఎస్. ప్రకాశరావుగారు "అంతే కావాలి" అనే తెలుగు చిత్రం త్వరలో ప్రారంభిస్తున్నారు ఆదినుండి అంతందాకా హాస్యరస భరితమై ఉంటుందట ఈ చిత్రం. ఇందులో పెళ్లికావలసిన అయిదుగురు ఆడపిల్లలుంటారు. కనుక అయిగురురు బ్రహ్మచారు లుంటారని వేరే చెప్పనక్కర్లేదు. ఈ చిత్రంలో రమణారెడ్డి, జగ్గయ్య, సోగారావు, నరసింహారావు, ఎస్. వి. రంగారావు, డా॥ శివరామకృష్ణయ్య, జి వరలక్ష్మి, మాలతి, జమున, సూర్యకాంతం ప్రభృతులు నటిస్తారని తెలుస్తోంది రచన ఆరుద్ర; దర్శకత్వం కె. ఎస్. ప్రకాశరావు

* * *

విక్రమ్ ప్రొడక్షన్స్‌వారు "మాగోపి" షూటింగ్ రేవతీస్టూడియోలో ప్రారంభించి ఏడెనిమిది కాల్‌షీట్లపైగా పని పూర్తి చేశారు. కామెరామన్ బి ఎస్. రంగా గారే స్వయంగా డైరెక్టుచేస్తున్నారు. గోపీ పాత్రధారిగా మాస్టర్ వెంకటేశ్వర్ అనే కొత్తకుర్రవాడు నటిస్తున్నాడు గోపీతల్లి చిన్నప్పుడే చనిపోతుంది అతణ్ణి అంతా వెలివేసినట్టు చూస్తూ ఉంటారు ఒక్క వదినెమాత్రమే అతణ్ణి ప్రేమిస్తుంది. గోపీకి తల్లిలేనికొరత ఆమె తీరుస్తుంది. ఈ వదినె పాత్ర జమున ధరిస్తున్నది.

* * *

భరణీస్టూడియోలో "విప్రనారాయణ" షూటింగ్ సాగుతున్నది. దేవదేవిభవనం సెట్‌మీద ఎక్కువపని కేంద్రీకరించబడి ఉండడంచేత ముందు ఆసెట్‌పని కానిచ్చేస్తున్నారు. దేవదేవి అక్కగా సంధ్య, తల్లిగా ఋష్యేంద్రమణి నటిస్తున్నారు ★

ఒకడు: ఏమండీ మీాయింటి ప్రక్క వున్నాయన రోజుకో రకం చెప్పుల జత తొడుగుతూ వుంటారు. ఆయనకేం పని?

మరొకరు: ఆయన ఇదివరకు నాటకాలలో వేషాలు వేస్తూవుండేవాడు.

* * *

విజిటర్ (ఖైదీతో): నీ వాళ్లెవరూ నిన్ను చూడడానికి రాలేదా?

ఖైదీ: నా వాళ్ళంతా ఇక్కడే వున్నారు.

—వల్లూరి రామారావు, (బంగరు)

"అన్నపూర్ణ" శిఖరారోహణ చిత్రంలో హిమాలయపర్వతాల గంభీర దృశ్యం.

జీసస్ శిలువమీద ఉండగానే,* ఆయనకు [illegible] *సైనికులు లాటరీ వేస్తున్నారు *"రోబ్"లో ఒకదృశ్యం.





జనతా వారి "పరివర్తన"లో పెరుమాళ్లు, కుటుంబరావు, ఎస్. టి. రామారావు, రమణారెడ్డి

★

"సంఘం"లో ఎస్. వి. రంగారావు, ఋష్యేంద్రమణి, ఎస్. టి. రామారావు.

# విజ్ఞానవీధులు

"డాక్టర్"

## 186. గొలుసుకట్టు ప్రక్రియ

యురేనియమ్ కేంద్రకంపైకి న్యూట్రానును పంపించినపుడు అది రెండు ముక్కలుగా విదళనాన్ని పొందుతుంది; ఆ కేంద్రకంలో బంధింపబడియున్న పరమాణుశక్తి కూడా అప్పుడు విడుదలౌతుంది. ఒక్క తులం యురేనియం విదళనమొందడం వలన జనించిన పరమాణుశక్తి సుమారు పదివేల పుట్ల నేలబొగ్గును కాల్చగా ఉత్పన్నమైన శక్తి అంత ఉంటుంది. అందుచేత పరమాణు గర్భాన్ని బ్రద్దలుకొట్టడం వలన విడుదల అయ్యే శక్తి అధికంగా ఉంటుందనేది నిశ్చయమే. కాని ఒక్క న్యూట్రాను ఒక్క యురేనియమ్ కేంద్రకం విదళన మొందేటట్లు మాత్రమే చేయగలదు. ఆ ఒక్క కేంద్రకము విదళన మొందడంవలన జనించిన శక్తి మన అవసరాలను పూర్తిగా తీర్చగలిగింది కాకపోవచ్చును. ఆ పరిస్థితులలో యురేనియమ్ కేంద్రకాలను ఎక్కువ సంఖ్యలోనే ఏకకాలంలో విదళన మొనర్చవలసియుండును. అయితే ఎన్ని యురేనియమ్ కేంద్రకాలు విదళన మొందాలంటే అన్ని న్యూట్రానులను యురేనియమ్ ముద్దపైకి పంపిస్తూనే ఉండాలి చిన్న యురేనియమ్ ముద్దలో కోట్లాది పరమాణువు లుంటాయి. ఆ పరమాణు కేంద్రకాలన్నీ విదళన మొందడానికి అన్ని న్యూట్రానులను పంపించాలి ఇది చాలా ప్రయాసకరమైన కార్యం; సాధ్యమయ్యేదికూడా కాదు.

మనదేశంలో సుమారు 36 కోట్లమంది జనులున్నారు. ఒక మతలబునిచ్చి దాని ప్రకారం ఈ జనులందరకు ఒక్కొక్కరికి ఒక్కొక్క ఉత్తరం వంతున వ్రాయమని ఒక వ్యక్తికి ఆదేశించినట్లయితే, కొన్ని సంవత్సరాల కాలమైనా అతడా పనిని పూర్తి చేయలేడు. అంతకంటె ఆ మతలబు ప్రకారం మనం మూడు ఉత్తరాలు వ్రాసి ముగ్గురకు పంపించి ఉత్తరాన్ని అందుకొన్న ప్రతి వ్యక్తి దాని ప్రకారం మూడు 'కాపీ'లను వ్రాసి ముగ్గురకు పంపించాలని మనం ఆదేశిస్తే మనం శ్రమపడ నక్కరలేకుండానూ, త్వరగానూ కూడా భారతదేశంలోని ప్రజలందరికీ ఆ ఉత్తరాలు చేరుతాయి. మొదట్లో మూడుగా బయలుదేరిన ఉత్తరాల సంఖ్య రెండవ దశలో మూడు మూళ్ళు తొమ్మిదిగానూ, మూడవదశలో తొమ్మిది మూళ్ళు ఇరువదియేడుగను, నాల్గవదశలో ఇరువదియేడు మూళ్ళు 81 గను, అయిదవ దశలో ఎనుబది ఒక్క మూళ్ళు 243 గను...ఇరువదవదశలో రమారమి 350 కోట్లుగను ఉండును. అవిచ్ఛిన్నంగా ఇట్లు గొలుసువలె సంఖ్యలు పెరుగు క్రియనే గొలుసుకట్టు ప్రక్రియ అంటారు. ఇటువంటి ప్రక్రియ యురేనియమ్ కేంద్రకం విదళన మొందడం విషయంలో కూడా జరిగితే ఎంత బాగుంటుంది! ఒక యురేనియమ్ కేంద్రకము విదళన మొందినప్పుడు సామాన్యంగా మూడు న్యూట్రానులు ఏర్పడతాయి. మన ప్రమేయం లేకుండా ఆ మూడు న్యూట్రానులు మరి మూడు యురేనియమ్ కేంద్రకాలనూ, ఆ యురేనియమ్ కేంద్రకాలు బ్రద్దలైనపుడు వచ్చే న్యూట్రానులు ఇంకొన్ని యురేనియమ్ కేంద్రకాలనూ, అవి విదళన మొందినప్పుడు వచ్చే న్యూట్రానులు మరికొన్ని యురేనియమ్ కేంద్రకాలను ... విదళన మొందేటట్లు చేయించినట్లయితే అవిచ్ఛిన్నంగా ఆ ప్రక్రియ జరుగగలదు.

కాని గొలుసుకట్టు ప్రక్రియ జరగడం కొన్ని పరిస్థితులమీద ఆధారపడియుంటుంది. పోస్టుచేసిన ఉత్తరాలలో కొన్ని చిరునామాదారునకు చేరకపోవచ్చును. ఇక ఉత్తరాలను అందుకొన్న వారిలో కొందరు బద్ధకంచేతనో మరి యే యితర హేతువులవల్లనో తమ కందిన ఉత్తరాలకు ప్రతులు వ్రాసి ఇతరులకు పంపకపోవచ్చును. ఆ పరిస్థితులలో ఉత్తరాల సంఖ్య తగ్గిపోతుంది. ఏదో ఒక దశలో ఉత్తరాలు అందుకొన్నవారందరు ప్రతులు వ్రాయడం మానుకొన్నయెడల ఆ విధానం అంతటితో నశించిపోతుంది. కాబట్టి ఉత్తరాల సంఖ్య వృద్ధికావడం తపాలా శాఖవారు వానిని చిరునామాదారులకు సవ్యంగా అందజేయడాన్ని బట్టియును, చిరునామాదార్లు తమ కందిన ఉత్తరాలకు ప్రతులు వ్రాసి ఇతరులకు పంపించడాన్ని బట్టియును ఉంటుంది. అదేవిధంగా యురేనియమ్ విషయంలో కూడా విదళనము గొలుసుకట్టు ప్రక్రియగా జరగడం కొన్ని ప్రత్యేక పరిస్థితులమీద ఆధారపడి యుంటుంది. ఆ పరిస్థితులను మనం కల్పించగలిగినట్లయితే ఎక్కువ మొత్తంలో పరమాణుశక్తి విడుదలౌతుంది.

—అనంత్.

### అందరూ ఒకటే

జవాను: (మానేజరుతో) అయ్యా! మీరు లేరని యెంత చెప్పినా వినరు. వచ్చినవారు "వారిని తప్పక యిప్పుడే చూడా" లని అంటారు.

మానేజరు: "వచ్చినవారంతా మీమాదిరే చెప్పుతారు విడవడానికి వీల్లేదు" అని జవాబు చెప్పి పంపించివేయి.

ఆదినం మధ్యాహ్నం ఒక స్త్రీ వచ్చి మానేజర్ గార్ని చూడా లన్నది. వీల్లేదన్నాడు జవాను. వొళ్లు మండిపోయి ఆమె "అరే! నేను ఆయన భార్యనురా" అంది.

జవాను: అమ్మా! వచ్చినవారంతా మీమాదిరే చెప్పుతారు. విడవడానికి వీల్లేదు.

—కె. బి. కృష్ణవేణి, (మైసూరు)

* * *

ఒక లాండ్రీవాడు "మీరు ఇక్కడ వుండగానే, మీ బట్టలు ఉతికి యివ్వబడును" అని బోర్డు కట్టేడు.

అది చూచి ఎదురుగానున్న డాక్టరు తనబోర్డుమీద "మీరు యిక్కడ వుండగానే, మీ కళ్లు పరీక్ష చేయబడును" అని వ్రాయించాడు.

—సి. బి. జగన్నాథరావు, కాకినాడ.

# ★ చిన్నబోయిన చెన్నపట్టం ★

(11- వ పేజీ తరువాయి)

ప్లీడర్లూ వెళ్లిపోతే, యింక యిక్కడ మా ముఖం చూసేవాళ్లు ఎవరు వుంటారు? అదీగాక - ఇన్ని సంవత్సరాలు యిక్కడ చాలీ చాలని ఆదాయంతో రోజురోజుకీ పెరిగే సంసారంతో జీవితం గడుపుకొచ్చాం. ఇప్పటికైనా మనదేశానికి పోయి, ఆపడే తిప్ప లేవో, మనవాళ్ళ మధ్యనే పడితే అక్కడికి అదొక రకం తృప్తిగా వుంటుంది ఏమంటారు?"

"నిజమేలెండి! మీరు అన్నట్లు మన వూళ్ళల్లో మెతుకులు తిని బతికినా యిక్కడ పరమాన్నం తిన్నదానికంటే మిన్నగా వుంటుంది మీరంతా గుంటూరుకే వెళ్ళాలి కాని, మీకు అక్కడ అంత కష్టపడవలసిన అవసరం ఏమీ వుండదు. అక్కడ ప్లీడరు గుమాస్తాలకి గిరాకీ చాలా ఎక్కువగా వుందట. గుమస్తా అనేవాడెవడైనా రోడ్డు మీద కనిపించాడంటే, కోడిపిల్లల్ని గద్దలు తన్నుకుపోయినట్లు తీసుకుపోతున్నారట- ప్లీడర్లు. నిన్న మాయింటి పక్కభాగంలో వున్న వారి బంధువు ఒకాయన గుంటూరు నుంచి వచ్చాడు' ఆయన చెప్పాడు—అక్కడ నెయ్యి, బియ్యం, వగైరా ధరలు ప్రతి ఏడాదికంటె కూడా యీ ఏడు చాలా తక్కువగా వున్నాయట అందుచేత మీలాటివాళ్ళు అక్కడికి వెళ్ళితే అన్ని విధాలా సుఖపడతారు. ఈ మహా పట్టణంలో యిలా ఒంటరి బతుకు బతికేకన్నా, మన వూళ్ళో మనవాళ్ల మధ్య మసులుతూ హాయిగా గడపొచ్చు...మిగిలిన అన్ని విషయాలలోనూ గుంటూరు గొప్పగానే వుంటుంది కానీండి - దాని దుంపతెగ ఎండ మాత్రం మహా దండిగా కాస్తుంది దాని కొక్కదానికి తట్టుకోగలిగితే గుంటూరు గంధర్వలోకం కదండీ .."

ఆ తరువాత వాళ్లు యింకా ఏమేమి మాట్లాడుకున్నారో నాకు వినటానికి ఆస్కారం లేకపోయింది. సంభాషణ యీ దశలోకి వచ్చేసరికి ఎదురుగా వస్తున్న ఏంబ్యులెన్సుకారుకి దారిచెయ్యటంకోసం జనంలోనుంచి నేనొక మూలకి కదిలి పోయాను. కారు దాటిపోయేలోగా నాముందు జటు దూరమైపోయింది. వారి కోసం వెతుకుతూ నేనూ ముందుకు పోతున్నాను.

"ఏమండీ! వెంగళ్రాయ చెట్టిగారూ? - మైలాపూరికిదా వచ్చివుంటిరె? - ఎల్లోరుం సౌగ్యందానే?"...రవ్వల దుద్దులు పెట్టుకొన్న ఒక సెట్టిగారు, జీరాడే జరీ కండువాతో చమురోడే భార్యారత్నంతో నడుస్తున్న మరొక చెట్టిగారిని పలుకరించారు

"చుమ్మావస్తిమి! మన ఆండవాళ్ళు బీచికిదా పోయి విడు స్తామంటె సరిదా అంటిని. బిడ్డు అంతా మన సొంతూరు పోయివుంట్రి. మేముదా వీట్లో రెండుపేరు ఐవుండి స్తిమి. నేటికి బార్దసాదికోయిలకు పోయివుంటమి ఇనికి గబాలీసుడికి పోలామా అని తలస్తిని. మన ఆండవాళ్లు ఇనికి కట్టాయం బీచికిదా పోవాలా అని నిండా గలటా సేస్తారు. 'సరి; అప్డియేసెయ్' అని యిట్లదా వస్తావుంటిమి అదిసరి - మీకుదా సెరయా వీడువుందే- మైలాపూరులో ఇంద ఆంద్రా హైకోర్టుదా పోయివుడుస్తే, మీయింట్లో వాడుగవుండే తెలుంగుకారుగా అంతా గాలీసేసి పూడుస్తురు అప్పొ...మనకిదా కొంచెం మిన్నాలియే కొల్లివిటా, నంబ కడైలో యిరికిరె నాల్ అంజిపేర్ ఆసామిగళుకి సౌకర్యమాన వీడు వేణుం. నంభసమాచారందా గొంచెం గమనంలో పెట్టుకోమీ. వీదుగాలి ఆచవుడనే కొళ్ళివిడు."

"సెయ్యుంగో! ఆనా - మిన్నాలియే బంగారయ్యశెట్టిదా నాకు సెప్పి పెట్టి వుండాడు. సూస్తాం. యదావదు పొరువళి పణ్ణివుట్టి, మీకుదా రెండు మాడు పోర్షన్ యిప్పిస్తును. పోయి వస్తానండి. అడియేన్ దాసన్!"

చెట్టిగార్ల జట్లూ విడిపోయాయి. చడీ చప్పుడూ లేకుండా నేను బీచిలో చేరి ఒకమూలగా పోయి కూర్చున్నాను. సముద్రుడు పాడే సంగీతానికి అపశృతిగా రేడియోలోనుంచి కర్ణాటక సంగీతం పొర్లుకొస్తోంది.

"ఏమండీ! మనం యిల్లు మారితీరాలండి. చచ్చిపోతున్నాను - పగలల్లా. మీకేం - మీరు హాయిగా ఆఫీసులో ఫానుకింద కూచుని కునుకుతీస్తుంటారు. గాలి ఆడని ఈ కొంపలో కుంపటిదగ్గర పడి నేను చచ్చిపోతున్నాను"—చల్లగాలికి మొఖం వాచివున్న ఒక యిల్లాలు, చిరాకు తగ్గివున్న యింటాయనకి,దరఖాస్తు పెట్టుకొంటోంది.

"మారదాం: మారదాం! ఇదుగో యీ హైకోర్టు వెళ్ళిపోయిందంటే వూళ్లో యిళ్లన్నీ ఖాళీయే. అప్పుడు మూడంతస్థుల మేడే ముప్ఫై రూపాయల అద్దెకు దొరుకుతుంది. ఇంకొక్క రెండు నెలలు ఓపిక పట్టు"—భార్య పెటుకొన్న దరఖాస్తుమీద భర్తగారి రిమార్కు

ఆతరువాత వాళ్ళ సంభాషణ అట్లా అట్లా తిరిగి తిరిగివచ్చి చివరికి అలవాటైన పోట్లాటల్లోకి దిగింది. 'స్వర్గాని కెళ్ళినా సవతిపోర'ని చెన్నపట్నానికొచ్చినా మొగుడూ పెళ్ళాల పోట్లాటలే వినక తప్ప నందుకు నన్ను నేను తిట్టుకొంటూ, యిసకదులుపుకొ నెమిషతో లెంపలేసుకొని సంచి పట్టుకొని చక్కా వచ్చేశాను

బస్సు స్టాండులో జనం కిటకిటలాడుతున్నారు. బస్సుమాత్రం యింకా రాలేదు. చెన్నపట్నంలో మోసం జాస్తి అనేమాట జ్ఞాపకానికిరాగా జేబులో పర్సు, సంచిలో సరుకు సరిచూసుకొన్నాను. వాటి ధర్మమా అని అన్నీ వున్నాయి.

—గుంటూరు గ్రామకాపురస్థుడు.
(మకాం : మద్రాసు)



## స్వర్గము

భార్య: ఆహాహా! ఎంత హాయిగా వుంది యిక్కడ!! దీన్ని చూస్తూవుంటే నోటమాటలు కూడా రావు!

భర్త: అయితే యిక్కడే వుండిపోదాము.

* * *

మాస్టరు: అరే! అబ్బాయి మనలో ప్రతిదినం అభివృద్ధి చెందేదీ క్షీణించేది ఏదిరా!

విద్యార్థి: దిన దిన మూ క్షీణించేది ఆదాయం. అభివృద్ధి చెందేది ఫ్యాషన్ సార్!

—కె. బి. కృష్ణవేణి

* * *

భార్య: ఏమండీ! క్లబ్బుకి వెళ్ళినట్లున్నారు. ఇవాళ పేకాటలో ఏమాత్రం గెలిచారు?

భర్త: రోజు విడిచి రోజు గెలుస్తానని యిదివరకు ఎన్ని సార్లు చెప్పేను?

భార్య: అయితే రోజువిడిచి రోజే ఆడకూడదా అండీ?

—సి. బి. జగన్నాధరావు, కాకినాడ

# ★ ఎండిన మొండిమధ్యాహ్నం ★

(10-వ పేజీ తరువాయి)

రా: ఎవరువారూ. నువ్వేనా, పాపం. నిన్నొరికే తిప్పుతున్నాం ఆయన ఎండలో పనిమీదవెళ్ళి తిరిగి తిరిగొచ్చి పడుకున్నారు. నువ్వు వచ్చావని రాగానే చెప్పాను. తనే వచ్చి మీ దుకాణం వాడుతో మాట్లాడతానన్నారు.

బా: ఇంకా మాట్లాడతవేవిటమ్మా. మూడునెల్ల కౌతా ఒక్క దమ్మిడీయైనా చెల్లుబెట్టకుండా మాట్లాడ్డానికొస్తారట మాట్లాడ్డానికి. మీ యింటికి తిరిగి తిరిగి కాళ్ళు పడిపోయాయి ఈ ఎండవేళ యెక్కడికీ వెళ్ళరుగదా అని తప్పకుండా ఇస్తారని నేవస్తే.

రా: అంత నిక్కచ్చిగా మాట్లాడితే యెలాగయ్యా. ఆయన దుకాణానికి వచ్చి అంతా సెటిల్ చేస్తారని చెప్తే వినవేం

బా: సాయంత్రంలోగా ఆయన వచ్చి సెటిల్ చెయ్యకపోతే దీపాలవేళ వచ్చి యిచ్చేదాకా గుమ్మంలోంచి కదలనన్నానని చెప్పండి.

రా: అమ్మయ్య - వెళ్లాడు - చూసూ సోరారా అబద్ధం ఎలా చెప్పిస్తారండీ! నిజంగానే పనుకు పట్టిందేమిటే? ఎండపడి వచ్చేరు పడితే పట్టనూవచ్చు. ఈ సపోటా పండే యీపూట భోజనం నాకు. నాకు మాత్రం నడుం వాల్చటంకంటె వేరే పనేముంది?......

[మునిసిపాలిటీ సైరన్ మొయ్యోమని కూస్తుంది. మళ్ళీ సోమేశం కలలు కంటూను, రాజ్యం గడప మీద నడుంవాల్చి ఉంటారు.]

సో:

గదిలోతల కలగా వెలుతురు,
ఈజీచైర్‌లో నా నీడల కలతలు,
గోడమీద గొలుసుల బొమ్మలు
గోడకింద చాపని అంటి
పళ్ళెంలో బెల్లంముక్కనో
కళ్ళంలో చిమ్మట తుక్కనో
చేరనే తొందరలోన
ఊరేగే చీమల బారు.

వీధివాకిట బిచ్చపు వెధవ
ప్రాణం వినిగెత్తించే, పేపే,
కొరుక్కుతినే కేక,
మునిసిపాలిటీ సైరన్ మార్జాలరావం
విరామ మెరగక వీధిగోడపైని
వెర్రివాడి వుపన్యాస ఫక్కిని
విసుగులేని ఫేక్టరీ ధోరణిలో
పంటికొక చావుకూత, కావు కావు
భూగర్భంలో పితృదేవతల
గుసగుసల్లాగ
గుండెల్లో జెంగల గురగురల్లాగ
కిటికీ పంచని బాకీవాడి రుసరుసల్లాగ
కుళాయిదగ్గర వోల్డ్ లేండ్ లేడీసణు
గుల్లాగ సాంఘీపులాగ ప్రపంచమంతా
మహా ప్రపంచపు నగర హడావిడి
అంతా అంతే
స్మృతి విస్మృతి సంధ్యల్లో మసకై
మసి ఐ విసవిసలై కసికసిగా
జాగది పక్కని నా గదిలోనే
నా మదిలోనే నా హృదిపై
నా కలలోనే నా తలపైనే
నాట్యం, చిందుల శివలయ నాట్యం.

[పిల్లల అల్లరి - ఆటగోల]

బల్లచెక్కతో రక్ ఢక్,
పగులు బంతితో ధప్, ధప్.
చిగురు గోచితో బంతాటాడే
తిక్లే యెరగని పొరుగు
పిల్లకాయలగం
తుల్లో గందరగోళంతో గం
తుల్లో గందరగోళంతో
శాంతి చెడిన మా తలవాకిలి
శాంతి చెడిన మా తలా వాకిలీ.

[పిల్లకాయలగోల క్రమంగా ఫేడవుట్]

వాకిలి అవతల రోడ్డుపైని
పాట్లపుస్తకాలో - రిబ్బన్లో
మాట్లో గిన్నెలకి - చీరలు దు
ప్పట్లూ రైకల గుడ్డలు తువాళ్లూ
వియ్యపరాళ్ళ జీళ్లో, బత్తై
పళ్లో - గాజులో
వాణ్ణి పొమ్మంటే
వాకిలి యివతల మంచంపైని
జలప్రళయంపు శయ్యాగృహం
రాధికా సాంత్వనం......
ఆఁ ఆఁ కౌగిలాలు లాగయ్యకురాజ్యం.

రా: చాల్లెండి అబద్ధపు వ్రాతలు. పడక్కుర్చీలో పడుకొని ఏదో మహాకావ్యం వ్రాస్తున్నారనుకున్నాను. ఇవా వ్రాతలు. ఏనాడేనాడో ఇంట్లో జరిగిన సంగతులన్నీ కలిపి ఇరికించేస్తే అదే కవిత్వమా?

సో: ఇది మహాకావ్యమే వెర్రిదానా. మనకదే మహాకావ్యం. ఈనాడు మనుషులున్నారో సామాన్య మానవుడు, వీధిమానిసి, మధ్యతరగతి వాడు, వాడే కథానాయకుడు. అంటే నేనే. నువ్వు కథానాయికవు.

రా: ఇవేం పద్యాలండీ మేం చిన్నప్పుడు చదువుకున్న తేటగీతులు కావు. ఆటవెలదులూ కావు. సీసాలా ఉత్పలమాలలా ఎందుకొచ్చిన పద్యాలూ.

డంతా ఇలాగే వ్రాస్తున్నారు. ఇలా వ్రాస్తేనే ప్రజలంతా మన్ని మహాకవి అని బ్రహ్మరథం పడతారు.

రా: పూలమాలలు పట్టుకు సిద్ధంగా ఏ స్టేషన్లోనో కాసుక్కూచుని ఉంటారు, వెళ్ళరండి త్వరగా.

పోస్టుమేన్: సార్ - సార్ - సోమేశం గారూ.

సో: రాజ్యం, దుకాణదారు గుమాస్తా యేమో.

రా: కాదండి, పోస్టుమేన్.

సో: ఏం పోస్టుమేన్. ఏం వుత్తరం తెచ్చావివాళ?

పో: సారీ, ఉత్తరాల్లేవుసార్, తమని ఊరికే చూసిపోదామని వచ్చాను.

సో: అవునులే ఆ విషయం నేను తరవాత మాటాడతానుగాని, నాకు ఒక ఉపకారం చేసిపెట్టు. ఒక పద్యం ఒకటి వ్రాశాను. దీన్ని కవర్లో పెట్టి అడ్రస్ వ్రాశాను. బిళ్ళలు అంటించడానికి డబ్బులేవు. 'నాట్ పెయిడ్'గా ఒక స్నేహితుడైన పత్రికాధిపతికి పంపిస్తున్నా. నువ్వేమనుకోక దీన్ని పోస్టులో వేసి పెడతావూ?

పో: తప్పకుండాను. సెలవు తీసుకుంటానండి

సో: థాంక్యూ. రాజ్యం - ఇలా రా మిగిలిన పద్యంకూడా వినేసెయ్యి మరి, మళ్ళీ యే బాకీవాడో రాకుండా.

రా: పోస్టుమాన్కిచ్చి పంపించెయ్యలేదూ.

సో: నాదగ్గరింకో కాపీవుందిగా. ఇదిగో విను.

పత్రికకో ప్రాణసఖుడికో బేరింగ్ లెటర్
పక్కయింటి స్టవ్ పై కాఫీవో రవ్వదో
సెదో కమ్మని వాసన
ధనాధిపతి నీచరాశిగతుడై వక్రించాడీ
మధ్యాహ్నం
ప్రాణప్రియ ముఖాన రోషం-ఉక్రోషం
కడుపుల్లో ఆకలి క్లేశం
బైటికి పోలేక ఆక్రోశం.
సామర్థ్యం అదృష్టం లేకున్నప్పటికీ
కూడాను
కారుల్లో యెక్కే సరదాయే
కొరుని, కడిగే సరదా లేదు, రాదు
లిమోజిన్సులో షికారుపోయే సాయం
త్రం యెంతమాత్రం కాదిది.
కూలివాళ్లు పనికైపోయే
బిచ్చగాళ్లు ముష్టికిపోయే
శుభోదయం అంతకంటె కాదిది
ఇది యెండిన మొండి మధ్యాహ్నం
మది యెండిన బండ మధ్యాహ్నం
హృది మండిన యెండు మధ్యాహ్నం.

బా: సోమేశంగారూ.

రా: ఎవరువారూ [illegible]

సో: [illegible]

# కాలక్షేపం

(7-వ పేజీ తరువాయి)

లేనప్పుడే రామరాజ్యంలో వారికి ఉన్నత గౌరవం ఉంటుంది. కాబట్టి శ్రీరామ రాజ్యంలో కూడా గౌరవంగలవాడే, గౌరవ్మెంటుఉద్యోగి అనిపించుకోవాలి

బాపూజీ మనకు త్రోవ చూపించాడు. *He showed us the way-* అని పెద్ద అక్షరాలతో కాగితాలు అచ్చువేసి అంటించాము మనలను నడిపించిన నేత బాపూజీ నేత చూపించినదే నీతి కాని, నేతిలో ఎంత కల్తీఉందో నేడు నీతిలోకూడా అంత కల్తీ ఉంది. కల్తీ నేతి సరకు అమ్మడం కూడా నీతిమాలిన పని అని అంగీకరించాలి. మహాత్ముడు మనకు యిచ్చినది కల్తీలేని నేతిసరకు. చక్కని నీతిమార్గం చూపించాడు. కల్లు త్రాగవద్దు అన్నాడు. త్రాగించవద్దు అన్నాడు కాని, ఆ నీతిని కూడా కల్తీచేసి, పులియని కల్లు అనగా "నీరా" త్రాగితే తప్పు లేదనిచెప్పి, గాంధీ మహాత్మకీ జై! అను మహారాజాలాగున నీరా త్రాగనీరా! అంటున్నారు.

ఇటువంటి కల్తీ నీతిని ప్రచారంచేయడం కంటె అపచారం యింకొకటి లేదు అవినీతిగా ప్రవర్తించేవాడుగాని, అవినీతి ప్రచారం చేసేవాడుగాని, ఆత్మహత్య అనేది ప్రత్యేకంగా చేసికోనక్కర లేదు. కొండమీదనుంచి క్రిందికి దూకనక్కర లేదు. పామునోట్లో చెయ్యి పెట్టనక్కర లేదు. మంటలలోదూకి, ఆహుతి కానక్కర లేదు. ఎంత చేసినవారి కంతయేగాని 'చింత ఏటికి రామ కృష్ణా' అనేమాట నిజము. గర్వించి కల్లు నెత్తిమీదకు వచ్చి కొండకొన ఎక్కిన వాడు కొండమీద నుంచి క్రిందకు పడ్తాడు. చూస్తూ చూస్తూ నిప్పులతో చెలగాటము ఆడేవాడు అగ్గిలో బుగ్గి అవుతాడు. విష సర్పములతో పయోముఖ విషకుంభములవంటి కల్మష బుద్ధులతో కలిసి కౌర్యకలాపములను సాగించెడి సాహసుడు ఆ విషమ విషతంత్రములలోనే విగత జీవులవుతాడు. అప్పుడు లోకం "అయ్యో! పాపం!" అనదు. "వాడిగతి అంతేకావాలి" అంటుంది. నీతిమాలి ప్రవర్తించడంకంటె, వాడు—

"ఉత్తర పర్వతాగ్రమునుండి
దృఢంబగు రాతిమీద పడి
త్వరముగ ద్రెళ్ళి కాయము
పాతంబుగ జేయుట మేలు"

అంటుంది

అవినీతి అతిశయించి, అంతశ్శుద్ధి ఆత్మతేజస్సు హరించి, ధాతువు క్షీణించి, ఆయువు మూడి, ప్రాణవాయువు వీడి, సంఘ కళేబరము కుళ్లి, పుచ్చి పురుగులు పట్టుచున్నప్పుడు, క్రిమిసముదాయ సంకులమై పూతిగంధ హేయమై దూష్యమైనప్పుడు, దానికి అంత్యపరిష్కారమైన అగ్ని సంస్కార మొనర్చి, ఒక అంత్య నమస్కారం చేయాలి. అవినీతిని దహించెడి ఆ పవిత్రాగ్నిహోత్రము ప్రజా హృదయ క్షేత్రమునుండి ప్రజ్వలిస్తుంది. అదే ప్రచండ ప్రజావిప్లవాగ్ని కర్మపరతంత్రునకు అగ్ని పూజ్యమైనది. అది ఆర్యలోక ఆరాధ్యమైనది అట్టి ప్రజావిప్లవము వర్ధిల్లుగాక! ఇంక్విలాబ్ జిందాబాద్! ★

# భిన్న స్వరాలు

(27-వ పేజీ తరువాయి)

కొంతవస్తే వుపయోగమేముంది? ఒకే మొత్తంగావస్తే మంచి వడ్డీతో ఎవడికైనా పెట్టుబడికిస్తే ..

"అయినా యితగాణ్ణి భ్రూరకపోనీరాదు. మెల్లగా మాట్లాడమంటాడు పైగా. అంత అభిమాన మేడ్చేవాడు విసరిపారేయరాదూ? అభిమానాలు . అభిమానాలయినా. ఏమి లేనన్నా ఈ నిక్కులతో నే నీల్గి గస్తూ వుంటారు రేపు ఫస్టున ఆఫీసువద్దే జీతమందిన నాడు పట్టుకుంటే స్నేహితుల ముందర తేలుకుట్టిన దొంగలా యిచ్చేస్తాడు. ఆ అభిమానమే నిజమయితే అలా చేస్తేనే వాడు మనిషి...ఛూ...పాడు ప్రపంచం..."

"ఏయ్! ఆపు." రిక్షా ఆగింది. బేడ చేతిలో వేసి రిక్షావాడు 'బాబూ' అని మరేమో అనే లోగానే గౌరయ్యగారు తలుపు వేసుకొని లోనికెళ్లారు. వాకిటివైపు చురచుర చూసి రిక్షావాలా బజారు మార్గం పట్టాడు.

## 4

బందర్ రోడ్డున గబగబ నడుస్తున్న రామారావు తల పైకెత్తనేలేదు. మెదడు మెలికల్లో ఆలోచనా ప్రవాహం ముడిబడుతోంది పాడుబ్రతుకు! నాది ఒక బ్రతుకే! అంతమందిలో ఆ త్రాష్టునివల్ల మాటలు పడాల్సి వచ్చింది వాడికి డబ్బే బాకీ తీసుంటేనో! ఆ...ఎందుకంటాడు. వచ్చే జీతం తొంభయిఏడు. ఇంటి బాడుక్కే పాతికపోతుంది మిగిలిందిజేనికి సరిపోతుంది. అయిదు మంది సంసారం. పెద్దపిల్లాడి చదువు ఛీ! చస్తేనన్నా బావుంటుంది ఇంట్లో పెండ్లాం బిక్కలపోరు, వీధిలో అప్పులాళ్ల హడావిడి, ఆఫీసులో ఆఫీసర్ చిరబురలు! ఛీ! ఛీ!

అయినా యిలాంటి నీచుడివద్దర అప్పు చేయటం నాదే పొరబాటు. కాని ఏంచేస్తాను. పిల్లాడికి మబ్బు కమ్మి మంచంలో బడితే! వీడే దిక్కయ్యాడు. ఏం? వూరికేయిస్తున్నాడా? ఎన్ని నెలలయితే అన్ని యిరవైఅణాలు చెవులుమెలేసి గుంజుకోడూ! అయినా షాహుకార్ల దౌర్జన్యం పోవాలి! వీళ్లున్నంత కాలం యింతే!

తోటి మనిషనన్నా భావించాడా? ధారా ప్రవాహంగా ఆశుకవిలాగ బాణాలు గుచ్చాడు పాడువధవ అందరిలోను. వాడికే నాలాంటి ఖర్మ పట్టకపోదు లే!

వీలయినంత త్వరలో వీడి డబ్బు విసిరి పారేయాలి ప్రతి నెలా అనుకుంటూనే వున్నాను. కాకుండా వుంది. పోయిన నెలేమో సుగుణకి జ్వరుడు.. జీతమే గాక అప్పుకూడ అయింది ఈ నెలేమో నాయన గారు క్రిందపడి కాలు బెణకడం ఖర్చుల పటమూ,..అన్నీ యిలానే అవుతున్నాయి ఒక జత గుడ్డలు తప్ప వాకేవీ లేవు అవే ప్రతిదినమూ సుగుణ సన్లైట్ సబ్బుతో వుతికి పెడ్తోంది. ఇంక ఆమె పని మరీ పాపం! రెండే రెండు చీరలు! అందులోను ఒకటి మొత్తబడింది ఇంక పిల్లలూ ...పైగా బంధువులూ. ఛి . ఛీ...

ఈ గౌరయ్యగాడి కొక్కడికే నయితే ఏలాగో యివ్వచ్చు. ఈలాంటి గౌరయ్యలు మరో పాతికమంది నెత్తిన వున్నారాయె. అయినా వీడికి పారేసి నాలుగు దులపాలి! కొంచమైనా మానవత్వముంటూ వుంటుందనుకున్నాడూ? ఆ గుంపులో తెలిసినవాళ్ళు వర్తైనా లేరుకదా కొంపదీసి! ఎవరైనా చూచివుంటే ఎంత అవమానం! వీడిపైన ఎలాగైనా కసి తీర్చుకోవాలి...మ్చ్. . ఏం చేయగలను నేను ? ఛూ...పాడు ప్రపంచం.

'కిర్' కారుకు సడన్ బ్రేకు పడింది. "ఏమయ్యోవ్ తూగుతూ తూలుతూ నడుస్తున్నావా?" కండ్లజోడు లోంచి తీక్షణంగా చూస్తూ గదమాయించాడు కారు వోనర్.

ఇహ ప్రపంచంలో పడ్డ రావుకాళ్లు ఆఫీసుకి దారితీశాయ్. ★

# న్యూస్ రీల్

(3-వ పేజీ తరువాయి)

వరకూ ఆగ్నేయాసియా రక్షణ పథకం గురించి బ్రిటిష్ ప్రభుత్వం ఏటి నిర్ణయమూ చేయబోదని సర్ విన్‌స్టన్ చర్చిల్ కామన్సులో ప్రకటించారు.

**మంగళవారం, మే 18:**

—గుంటూరులో హైకోర్టు స్థాపన సందర్భంలో నిర్బంధంగా భవనాలను స్వాధీన పరుచుకోడానికిగాను ప్రభుత్వం ప్రవేశపెట్టిన బిల్లునూ, విద్యుచ్ఛక్తి ఉత్పత్తి కేంద్రాలను స్వాధీనపరుచుకోడానికి ప్రవేశపెట్టిన బిల్లునూ ఆంధ్రరాష్ట్ర శాసనసభ సెలక్టు కమిటీల పరిశీలనకు ఒప్పగించింది.

—కొరియా అంతటా ఎన్నికలు జరిపే విషయంలో దక్షిణ కొరియాతో అమెరికన్ ప్రభుత్వం ఒప్పందం కుదుర్చుకోలేక పోయిందని అమెరికా జనీవాలో బ్రిటిష్ ఫ్రెంచి ప్రతినిధులకు తెలియపరిచినట్లు జనీవా వార్త.

—నూతన ప్రాథమిక విద్యావిధానాన్ని రద్దుపరిచి 1954 జూన్ నుంచి పాతపద్ధతినే అమలుజరపాలని మద్రాసు ప్రభుత్వం నిశ్చయించినట్లు విద్యామంత్రి సి. సుబ్రహ్మణ్యంగారు మద్రాసు శాసనసభలో ప్రకటించారు.

—కరాచీ, లాహోర్, పెషావర్ మొదలైన ప్రాంతాలలో కమ్యూనిస్టు నాయకులను అరెస్టు చేసినట్లు కరాచీవార్త.

—ఉత్తర వియత్నామ్ జిల్లాలోని ఫ్రెంచిస్థావరంపైకి 30 వేల వియత్‌మిన్ సైన్యం దాడి వెడుతున్నదని హానోయ్‌లో ఫ్రెంచి అధికారులు ప్రకటించారు

—కొరియాలో ఉభయ ప్రభుత్వాలూ ఒక ఉన్నతాధికారసంస్థకి లోబడి సహకారంతో సమస్యలను పరిష్కరించుకోవాలని పండిట్ నెహ్రూ పార్లమెంట్‌లో సూచన చేశారు. ఇండోచీనాలోకూడా ఇదే విధంగా పరిష్కరించుకోవచ్చునని చెప్తూ, ఫ్రాన్స్‌తో బాంధవ్యం పెట్టుకోడానికి సిద్ధంగా ఉన్న వియత్‌మిన్ అధికారుల రాజీవిధానానికి హర్షం ప్రకటించారు

—హైదరాబాద్ రాజ్యాన్ని భాషల ప్రకారం విభజించి ఆయా భాషారాష్ట్రాలతో చేర్చాలని ఫజల్ అలీ కమిషన్‌కు నివేదించడానికి హైదరాబాద్ రాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గం నిర్ణయించింది. ★

(26-వ పేజీ తరువాయి)

నిగలాడుతూ వుంటుంది; క్రాపు వెనక వేపున తెల్ల వెంట్రుకలు కొన్ని కనపడుతున్నాయి కళ్లలో యౌవన సహజమైన కాంతి, నెత్తురు చారలూ మసక మసకగా కనపడుతున్నాయి. నాన్న విచారించే చేశాడా ఈ పెళ్ళి? ఆమె నవ్వుకుంది. తనకి పెళ్ళయితే చాలు అని నాన్న భావం అయివుంటుంది ముసలివాడయితే ఏం, వయసువాడయితేం! తనకు ఒకటే; తనను గుడ్డివాడు తప్ప కళ్లున్నవాడెవడూ ప్రేమించడు

ఇల్లంతా బంధువులతో నిండి కళకళలాడుతోంది వాళ్ళకి ఉపచారం చెయ్యటంలో సతమతమౌతున్నా, సువర్ణంగారి దృష్టంతా సరోజినిమీదే వుంది. ఆమె అసలు రూపు బైటపడితే ఏం చిక్కు వస్తుందో అని ఆలోచిస్తున్నాడాయన ఏది ఎట్లా జరగాలో అట్లాగే జరుగుతుందని మనస్సు కుదుటపర్చుకున్నాడు కొంతసేపు. కొంతసేపు—మొగుడంటూ వొకడు దొరికాడు, మంగళసూత్రం కట్టాడు; చాలు. ఇకముందు వాడు కోపం వచ్చి వెళ్లిపోయినా బాధలేదు అనుకున్నాడు కాని ఆ తండ్రికేం తెలుసు ఆడదాని మనస్సు? సంఘంలో తన మర్యాద కాపాడుకోడంకోసం తన బాధ్యత తాను నెరవేర్చటంవరకే చూసుకున్నాడు. కురూపి అయినా, రోగిష్టిదిఅయినా, ఆడదానికి మొగుడితో సరసమాడాలని, కాపరం చెయ్యాలనీ కోరికగా వుంటుందని ఆయన మర్చిపోయినాడు ఆయన సంతృప్తల్లా, 'నా కూతురు ఎటువంటిది అయితేం, పెళ్లిచేశాను' అని మాత్రమే

రాత్రి పది గంటలు దాటింది; సరోజిని, శేఖరం కార్యం గదిలో మంచంమీద చెరొకవైపూ కూర్చునివున్నారు. రాత్రిచీకటి గుయ్యారంగా వుంది బైట ఆ యింట్లో లైట్లు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. ఆ గదిలో మందమైన నీలిరంగు బల్బు వెలుగుతోంది పెళ్లికూతురు మేలిరకం పట్టుచీరె కట్టుకుంది. వొయ్యారమైన ఆమె శరీరపు వొంపులకేసి చూస్తూ సిగరెట్టు తగలేస్తున్నాడు శేఖరం. ఎంత నాజూకైన వేళ్ళు! అందాలు చిందుతున్న వొళ్లు. కొంచెం అందవిహీనంగా వుంటుందని మామగారు స్వయంగా చెప్పాడు—కాని ఇదేమిటి? తెలివితక్కువ...

"పొద్దుణ్ణించీ, నీతో మాట్లాడాలని చూస్తున్నాను గాని పడలేదు" అన్నాడు శేఖరం. అతనికి చాలమంది స్త్రీలతో పరిచయం వుంది లోగడ. అందువల్ల భీతి, సిగ్గూ లేకండా వంటనే మాట్లాడగలిగాడు

సరోజిని మౌనంగా వింటున్నది; గుండె దడదడలాడుతున్నది.

"నువ్వు ఎందుకే ముసుగు వేసుకుంటున్నావు ఎప్పడూ? నీకేం భయ మక్కర్లేదులే తీసెయ్యి" అన్నాడతను తాపీగా.

సరోజినికి గుండె ఆగిపోయినంతపనైంది. కాని కొంచెం తమాయించుకుని ఖచ్చితంగా, "వొద్దండి. ముసుగు తీస్తే భరించలేరు. నామాట వినండి" అన్నది చివరి మాట అంటూ ఏడుపు ఆగక, ఏడ్చేసింది

శేఖరం, ఆమె దగ్గరగా జరిగి, ఆమె చేతులు పట్టుకున్నాడు. "ఏడవకు. నేనేమనను లే. నువ్వెట్లావున్నా నాకేం ఫర్వాలేదని, మీ నాన్నతో చెప్పాను మొదట్లోనే." అతనికి, ఆ మేలిముసుగు తీసి చూడాలనే కోర్కె నిమిష నిమిషానికీ ఎక్కువౌతోంది అయితే ఆమె ఇష్టానికి వ్యతిరేకంగా ఎలా ప్రవర్తించటం? ఇక వొకటే మార్గం. ఆమె నిద్రపోతున్నప్పుడు, తీసిచూడాలి...

ఇద్దరూ ఎట్లాగో మనస్సులు సరిచేసుకుని, ఒకరిపక్కన ఒకరు పడుకున్నారు ఎవరి ఆందోళనతో వాళ్ళు నిద్రపట్టక కళ్లు గట్టిగా బలవంతంగా మూసుకుని పడుకున్నారు రెండోవారు నిద్రపోయాక తాము నిద్రపోవాలని ఉభయులూ ఆలోచించుకుంటున్నారు శేఖరం గది కప్పునకున్న కడ్డీలన్నిటినీ లెక్కపెట్టాడు. కిటికీల చువ్వ లెన్నో లెక్కపెట్టాడు. కిటికీ తెరల రంగుల్ని క్షుణ్ణంగా పదిమాట్లు జ్ఞప్తిచేసుకున్నాడు అతను వ్యభిచారి అయినా ఈ వాతావరణం, ఈ అమ్మాయి అతనికి ఎందుకూ కొత్తగా తోచింది. ఏమిటీ రహస్యం? ఆ అమ్మాయి అట్లా తనను చూసి వొణికిపోతున్నదెందుకు? శేఖరం పక్కకుతిరిగి, సరోజనిని మెల్లగా కౌగలించుకున్నాడు. ఆ రాత్రి - సరోజని నిద్రపోయాక అతను ఆమె మేలిముసుగు తొలిగించి చూశాడు. భయంతో అతని వొళ్లు జలదరించింది. కాని తమాయించుకున్నాడు. ఆ తర్వాత నిద్రమాత్రం పోలేదు. అతనికి డబ్బూ, అది ఇచ్చే సుఖాలే జ్ఞాపకం రాకపోయినట్టయితే, అప్పుడే పారిపోయి వుండేవాడు.

[ఇంకా ఉంది]

Edited, Printed & Published by S. Sambhu Prasad at the A...

